# బాబ్

## రచనలల్లోని గ్రంథభాగాల

## సంకలనము

సంకలన కర్తలు
విశ్వన్యాయ మందిరము

తెలుగు అనువాదము
వావిలాల సోమయాజులు

బహాయి పబ్లిషింగ్ ట్రస్ట్
పి. జి. బాక్స్ 19
న్యూ ఢిల్లీ.

# A COMPILATION OF PASSAGES FROM

# THE WRITINGS OF BAB

*Compiled by*

The Universal House of Justice

*Translated by :*

VAVILA SOMAYAJULU

*Telugu Edition*





*First Edition 4000 Copies Feb. 1982*

BAHA'I TELUGU PUBLISHING COMMITTEE
OF BAHA'I PUBLISHING TRUST

BAHA'I INSTITUTE
9-1-97, Tatachari Compound, Sarojini Devi Road,
SECUNDERABAD-500025.
Telephone: 77804

Printed by : Venkataramana Printers, 3-2-170, Secunderabad-3 (A.P.)

# సజీవ ప్రథమలేఖకు ఫలకము

ఇది సమస్తమానవజాతికి మా ప్రత్యక్షతవల్ల కలిగే బోధనగా ఉపయోగించటంకోసం ఎవరిని దేవుడు రూపొందిస్తాడో ఆ ఆయన ప్రథమ విశ్వాసికి మేము తెలియజేసినది.

## సర్వశక్తివంతుడు, అత్యుత్తమప్రియుడు అయిన ఆయన పేరుతో

1. స్వర్గ భూ రాజ్యాలకూ, వాటికి మధ్య ఏమున్నదో ఆ ంతటికీ ఎవరు సర్వాధికారి అయిన ప్రభువో, ఆయన స్తుతి యుతుడు, మహామహిమాన్వితుడు. సర్వం నిశ్చయంగా ాయనదగ్గరకు తిరోగమిస్తుందనీ, ఆయన ఎవరిని సంతృప్తి ిరచదలచాడో వారిని తనస్వీయమైన ఆజ్ఞతో నడిపించేవాడు ాయన ఒక్కడే అని ప్రవచించు. సర్వమానవులు ఆయన ాశీస్సులను అర్థిస్తారనీ, సృజితమైన సమస్త వస్తువులమీద ాయన సర్వాధిపతి అనీ ప్రవచించు. ఆయన సమస్తమహిమో ితుడు, మహాశక్తివంతుడు, పరిపూర్ణప్రియుడు.

ఇది "ప్రథమవిశ్వాసి" అయిన అతనికి, ఉపయోగింపబడ్డ థా"అన్నలేఖలోని ఆలేఖ్యము. ఆయనను నేను, నేనే; సర్వాధి ితిని, సమస్తశక్తివంతుడును అన్న అంశానికి నిశ్చయంగా ివు సాక్ష్యము వహించు. ఎవరు జీవితాన్నీ, మృత్యువునూ ియమిస్తున్నారో ఆ ఒక్కడు ఆయనే; అందరూ ఆయనదగ్గ ికే తిరోగమిస్తారు. వాస్తవంగా ఆయన తప్ప మరొక దేవుడు ేడు; ఆరాధనవేళ అందరూ ఆయనముందు వినమ్రులౌతారు. ాయన నిర్ణయించినట్లు నిశ్చయంగా మీ ప్రభువు, దేవుడు 'నీవు ఉండు"; "అది ఉన్నది" అన్న పదాలను ఉచ్ఛరించే

దానికంటే వేగంగా ప్రతివారికీ ప్రతిఫలమిస్తాడు. దేవుడు ఆతని పుస్తకంలో సత్యంగా ప్రమాణీకరించాడు, అదే విధంగా ఆతని దేవదూతల సమాజాన్ని, ఆతని వార్తావహులను దివ్య జ్ఞానభారవహులనూ మీరు దేవుడిలోను అయన చిహ్నాలలోను విశ్వాసంకలవారనీ, మీ మార్గదర్శన సాశీల్యంవల్ల ప్రతిఒక్కరు సక్రమంగా నడుపబడుతున్నారనికూడా ప్రమాణీకరించాడు. ఇది రూఢిగా నిత్యజీవుడు, స్వీయజీవనాధారుడు అయిన దేవుడు భూతకాలంలో ఔదార్యంతో ప్రసాదించినదీ, ఈకాలం తరువాత ప్రసాదింపనున్నదీ అయిన అవధిరహితకృప. అంతే కాక సృష్టికి పూర్వమే నీవు దేవునిఎడ విశ్వాసము వహించడం వల్ల అయన సత్యంగా తనఅనతితో ప్రతి అవిష్కరణ సమ యంలోను నిన్ను సముద్ధరించాడు. సార్వభౌమాధికార రక్ష కుడు సమస్త మహిమాన్వితుడు అయిన ఆతడుతప్ప మరొక దేవుడు లేడు. నీవు సృజితమైన సమస్తవస్తువులకు దైవబీజము అయన అస్తిత్వంనుంచి వచ్చే అనుగ్రహచిహ్నానివని ప్రకటిం చటం ఎంతో యోగ్యము; అత్యుత్తమోదారుడు, సమస్త బంధ నుడు అయిన ఆతడు తప్ప దేవుడు లేడు.

ఇలా ప్రవచించు : "పరిష్కారంకోసం సర్వవిషయాలను దేవుడి పుస్తకం దగ్గరకు పంపవలసిందే; దేవుడిని, అయన చిహ్నాలను నమ్మటంలో నేను ప్రథముడను; సత్యాన్ని ఎవడు బహిరంగపరిచి ప్రకటించాడో అవ్యక్తిని నేను, నేను మహా శక్తియుక్తుడు, నిరుపమానుడు అయిన దేవుడి ప్రతి శ్రేష్టతమ బిరుదంతో వ్యవహరింపబడ్డాను. నిజంగా నేను ప్రథమ ప్రత్యక్షదినాన్ని సంపాదించాను; అంతేకాక ప్రభునిఅజ్ఞవల్ల అయన కృపకు సంకేతంగా నేను తరువాతిప్రత్యక్షదినాన్ని

సంపాదించితీరుతాను. అతడుతప్ప దేవుడు లేడు; అంతేకాదు నియమితసమయంలో ప్రతివ్యక్తీ ఆరాధిస్తూ ఆయనకోసం నమ్రులౌతాడు.

గడచిన దినాలల్లోను, రానున్న దినాలల్లోను అతని హేతువుకు సూచకుడిగా అతనిచేత ఎన్నుకోబడుతున్నందుకు దేవుడికి నేను కృతజ్ఞతను నివేదిస్తాను; ప్రశస్తిని సమర్పిస్తాను; మహామహితుడు, సమస్తప్రశస్తుడు, నిత్యసుస్థిరుడు అయిన అతడు కాక మరొకడు లేడు. స్వర్గాలల్లోను, భూమిమీద ఏమున్నదో అది అతనిది; అంతేకాక అతనిద్వారా మనం సక్రమంగా నడపబడుతున్నాము.

ఓ బయాన్ ప్రజలారా! ఎవరు సత్యాన్ని అవలంబిస్తారో వారు గ్రంథంలో నియమితులైనట్లు నావైపుకు తిరగవలె; ఎవరు నా అస్తిత్వాన్ని (ఉనికిని) పొందుతారో వారికి దివ్యమార్గదర్శనం స్థిరపరచడం జరుగుతుంది."

## మహమ్మద్ షాకు చెందిన లేఖ్యంనుంచి గ్రహించిన భాగాలు

2. దేవుడు నన్ను ఏ పదార్థంతో సృష్టిచేశాడో అది, దేనితో ఇతరులు రూపొందింపబడతారో, ఆ రేగడిమట్టి కాదు; ఆయన నాకు లౌకికవివేకులు దేనిని ఎన్నడు గ్రహించలేరో లేదా విశ్వాసపాత్రులు దేనిని ఎన్నడూ కనిపెట్టలేరో దానిని అనుగ్రహించారు.... నేను దేవుని పతనంకాని ప్రథమశబ్దస్తంభాలలో ఒకదానిని. ఎవరు నన్ను గ్రహించారో వారు సత్యము, సక్రమము అయిన సర్వాన్ని తెలుసుకున్నారు; ఉత్తమము, యుక్తము అయిన సమస్తాన్నీ సంపాదించారు; మరి ఎవరైతే

నన్ను గుర్తించటంలో అపజయం పొందారో వారు సత్యము సక్రమమూ అయిన సర్వానికి దూరంగా తిరోగమించారు; దోషయుతము, యుక్తారహితము అయిన ప్రతిపదార్థానికి లొంగిపోయినారు.

నేను సృష్టింపబడ్డ సమస్తవస్తు ప్రభువు, సర్వప్రపంచ ప్రభువు అయిన నీ ప్రభువువారి ధర్మముమీద ప్రమాణం చేస్తాను! ఈ ప్రపంచంలో ఎన్ని మహాసౌధాలను, నిలవబెట్ట దలిచి, దేవసంబంధమైన విజ్ఞానాన్ని తనలో నిలుపుకొన్న, ప్రతి సద్గుణచర్యలో దేవుణ్ణి పూజింపదలచి, ప్రభువు ప్రత్యక్షాన్ని పొందదలచి దేవునిముందు పరిగణకు వచ్చేదానికన్నా తక్కువ పరిణామంలోనైనా నాఎడ అసూయాచిహ్నాన్ని వహిస్తే ఆ మానవునిచర్యలు సర్వంశూన్యంగా క్షీణింపబడతాయి; ఆ వ్యక్తి దేవుని అనుకూల్యదృష్టులను కోల్పోతాడు; అయన క్రోధానికివస్తువై రూఢిగా వినాశం పొందుతాడు. అయన విజ్ఞాన కోశంలో ఉన్న ఉత్తమవస్తువులు నాయెడ విధేయతవల్ల పొంద బడతాయని, దేవుడు శాసించటంవల్ల అందుచేత అవీ, నాయెడ అవిధేయతవల్ల ఆయన గ్రంథంలో లిఖితమైన ప్రతిఅగ్ని పొందబడుతాయి. నేను ఈనాడు, ఈస్థానంనుంచి ఎవరు స్వర్గసౌధాలల్లో స్థిరత్వాన్నివహిస్తూ, నాప్రేమను అనురాగంతో పెంపుదల చేసుకుంటూ నా ఆజ్ఞను అనుసరిస్తున్నారో వారంద రినీ ఎవరు నరకాగ్ని నిమ్నతలకు అధీనం చేయబడ్డారో ఆ నా శత్రువుల సమస్త సమాజాన్నీ దర్శిస్తున్నాను.

నా జీవితంమీద ప్రమాణం! ఎవరు దేవుని ప్రమాణమో అతని హేతువును అంగీకరించటానికి ఉన్న బాధ్యతవల్లతప్ప.... నేను దీనిని మీకు వెల్లడించేవాడిని కాదు. దేవుడు స్వర్గానికి

సంబంధించిన తాళంచెవులు అన్నీ నా కుడిచేతిలోను, నరకానికి సంబంధించిన తాళంచెవులు అన్నీ నా ఎడమచేతిలోను ఉంచటానికి అభిలాషపడ్డాడు.

నేను సృజింపబడ్డ సమస్త వస్తువులు దేనినుంచి ఉద్భవించాయో దాని ప్రథమబిందువును. నేను దేని తేజస్సు ఎన్నడూ మరుగుపరపబడదో ఆ దేవముఖప్రీతిని; దేని శోభ మ్లానంకాదో ఆ దేవజ్యోతిని. ఎవరైనా నన్ను అంగీకరిస్తే వానికోసం నిశ్చయము, సమస్తలాభము సంచితం చేయబడిఉన్నవి; ఎవరైనా నన్ను గుర్తించటంలో అపజయం పొందితే వాడిని అధోలోకమూ, సర్వదోషమూ నిరీక్షిస్తూ ఉంటవి....

తుల్యరహితుడు, నిరుపమానుడు, సత్యసంధుడు అయిన దేవుడిమీద నేను ప్రమాణం చేస్తాను. సర్వమానవులు ఆయన హేతువుకు అధీనులు అయ్యేటందుకు శక్తివంతులు చేయబడటంకంటే భిన్నమైన మరొక కారణంతో కాక దేవుని పరమ దృష్టాంతమైన నన్ను ఆయన స్పష్టమైన గుర్తులతోను చిహ్నాలతోను వ్యవహరింపజేశాడు.

పరిపూర్ణ సత్యమైన ఆయన ధార్మికతవల్ల యవనిక, ఎత్తబడితే, భూమి సమతలంమీద నా ప్రేమవృక్షచ్ఛాయక్రింద ఎవరు ఆశ్రయాన్ని అపేక్షించారో వారు తప్ప నరకాగ్నికంటే భీకరమైనదీ అధికతీరమైనదీ అయిన అగ్నివల్లా, దేవుని క్రోధాగ్నివల్లా నొప్పింపబడే సమస్తమానవులనే మీరు దర్శిస్తారు. ఎందువల్లనంటే వాస్తవిక సత్యానికి పైవారు పరమానంద సౌఖ్యసంపన్నులు.

# మక్కా షెరీఫ్ చిరునామాతో వెల్లడిచేసిన మాటలుగల ఫలకం నుంచి గ్రహింపబడ్డ భాగాలు

3. ఓ షెరీఫ్.........మమ్మల్ని అర్చించటానికి నీ జీవితాన్ని అంతటినీ సమ్మతింపచేశావు; కాని మేము నీకోసం మమ్మల్ని ప్రత్యక్షీకరించుకొన్నపుడు మా జ్ఞాపకానికి సాక్ష్యం వహించటాన్ని, అతడు నిశ్చయంగా అత్యధిక ఘనుడు, సమస్తాధికార సత్యస్వరూపుడు, సర్వమహిమాన్వితుడు అని స్థిరపరచటానికి సాక్ష్యంవహించటాన్ని ఆపివేశావు. అందువల్ల పునరుత్థాన దినంనాడు నీ ప్రభువు నిన్ను నిదర్శనగా నిలిపివేశాడు. నిజంగా అతడు సమస్తవిజ్ఞాని, సర్వవివేకి.

మేము పుస్తకాన్ని నీకు పంపినప్పుడు "నేను ఇక్కడ ఉన్నాను" అని సకాలానికి ఉచ్చరించినట్లయితే నిన్ను వారు సత్యంగా నమ్మినట్లు మా సేవకులైనవారి సమాజంలో నిన్ను ప్రవేశపెట్టితీరేవారము; ఎప్పుడు మానవులు నిర్ణయంకోసం మా ముందు కనిపించితీరేవారో ఆనాటివరకూ నిన్ను మా గ్రంథంలో ఔదార్యోపేతంగా ప్రశంసించేవాళ్ళము. నీ ప్రభువు కోసం నీ జీవితమంతా కాదు, ఆదిలేని ఆదినుంచి, నీవు జరిపిన పూజాచర్యలకంటే సత్యంగా, ఇది నీకు అధిక ప్రయోజనాన్ని కోరి నెరవేర్చి ఉండేది; నిరంతరం నీ అత్యుత్తమ ప్రయోజనాలను నెరవేర్చేది. నిజంగా మేము సర్వవిషయాలను ఎరిగినవారము. అయినా పునరుత్థాన దినంనాడు అడ్డుపెట్టకుండా మా ప్రత్యక్షతను పొందే ప్రయోజనంతో నీకు ఉనికిని కల్పించి మేము నిన్ను పిలిచాము. కారణంగాని

లేదా స్పష్టమైన లేఖనంగాని లేకుండానే మా నుండి దూరంగా నిన్ను నీవే ముకుళింపచేసుకొన్నావు. బయాన్ విజ్ఞానంతో అనుగ్రహింపబడ్డటువంటి వాళ్ళలో నీవు ఉన్నట్లయితే నీవు గ్రంథం కంటపడగానే ఆపదలో సహాయకారి, స్వీయజీవనుడు అయిన అతనికంటే వేరు దేవుడు లేడని ప్రమాణపూర్వకంగా ప్రకటించేవాడివి. ఎవరు కురాన్‌ను బహిర్గతంచేశాడో ఆతడే ఈ గ్రంథాన్నిసహితం అదేవిధంగా బహిర్గతంచేశాడనీ, ఇందులోని ప్రతిపదం దేవుడినుంచి ఉద్భవించిందనీ, దీనియెడ మేమంద రము భక్తిభావాన్ని వహిస్తున్నామని ధృవపరిచేవాడివి.

ఏమయినప్పటికీ ఏది ముందుగా నియమితమైనదో అది గడిచిపోవటం జరిగింది. మా ద్వారా ఇంకా ఆవిష్కరణము సాగుతున్న సమయంలో నీవు మాదగ్గరకు తిరిగివస్తే మేము నీ అగ్నిని తేజస్సుగా పరివర్తనచేస్తాము. సత్యంగా మేము సర్వ వస్తువులమీద శక్తివంతులము. కానీ, నీవు ఈపని చేయటంలో అపజయాన్ని పొందితే దేవుడి హేతువును ఆలింగనం చేసు కోవటం తప్ప వివృతమార్గము మరొకటి నీకు కనిపించదు: నీ భక్తివిషయాన్ని ఔదార్యంతో ఆయన దృష్టిముందుకు తెమ్మని ప్రార్థించటానికి ఎవరిని దేవుడు ప్రత్యక్షం చేశాడో ఆతడు నీవు శ్రేయస్సును పొందటానికీ, శక్తిని కల్గించటానికీ నీ అగ్నిని జ్యోతిస్సుగా పరివర్తనపొందటాన్ని కల్గించటానికి మాకొరకు ఏది క్రిందకు పంపబడిఉన్నదో అది ఇదే. ఇది జరగకపోతే మేము దేనిని ఏర్పాటుచేస్తే అది బంధితమౌతుంది. ఆపదలో సహాయకారి, స్వీయజీవనుడు అయిన దేవుడిచర్య తిరుగులేకుండా నిర్ణయింపబడుతుంది; అందువల్ల మాపక్షాన న్యాయచిహ్నంగా నిన్ను మా ప్రత్యక్షతనుంచి బహిష్కరిస్తాము.

నిశ్చయంగా న్యాయనిర్ణయ విషయంలో మేము పక్షపాత రహితులము.

## కయ్యూముల్ అస్మా లేఖన భాగాలు

4. "అతని వయస్సు ఇరువది అయిదుకంటే ఎక్కువ లేనప్పుడు అతడు దేవుడిని గురించి ఎలా మాట్లాడగలడు" అని అనవద్దు. నేను పలికేది విను. స్వర్గలోకాలకు, భూమికీ అధిపతియైన ప్రభువుమీద ప్రమాణంచేసి పలుకుతున్నాను. "నిశ్చయంగా నేను దేవుని సేవకుడను. బహుకాలం నిరీక్షింపబడ్డ దేవశేషము ఎవరో అతని ప్రత్యక్షతకు సంబంధించినవీ, ఖండనరహిత మైనవీ అయిన నిదర్శనలకు నేను బారవహుడనుగా కల్పితుడ నైనాను. దేవుడి ప్రత్యక్షాన, ఇక్కడ నీ కంటి ముందు మాతృగ్రంథంలో వాస్తవంగా లిఖితమైనట్లు నా గ్రంథమున్నది. నేను ఎక్కడ ఉన్నప్పటికీ దేవుడు నన్ను దీవించాడు; భూమిమీద నేను మీ మధ్య ఉన్నంతకాలం ప్రార్థన, సహిష్ణుతలను అనుసరించవలసిన దని అతడు నన్ను ఆజ్ఞాపించాడు. [పరిచ్ఛేదము IX]

5. ఓ భూప్రజలారా! నేను ఏకైకసత్యదేవుడి ధర్మాన్ని అనుసరించి మృదులము, సంచలితము అయిన మాణిక్యరాసి నుంచి రూపొందింపబడ్డ సౌధములో నివాసంచేస్తున్న బహా ఆత్మపుత్రికను అయిన స్వర్గకన్యను; శక్తివంతమైన ఈ స్వర్గంలో నేను ఈ అరబ్బుయువకుడి సద్గుణాలను కీర్తించటంతో దేవుడి శ్రుతిని ప్రకటనచేయటం తప్ప ఇతరమైనదాన్ని ఎన్నడూ తిలకించలేదు. సర్వకరుణాకరుడైన నీ ప్రభువు తప్ప వాస్తవికంగా మరో దేవుడు లేడు. వివృద్ధంచేయుము:

నీవు, తరువాత ఆతని స్థానము; ఎందువల్లనంటే దర్శించుము: ఎక్కడ ఆతని స్తవము ఉదాత్తస్వరముతో ఉచ్చరింపబడు తుందో ఆ పటకుటీరంలోని దేవుని ప్రశస్తిపొందిన ఆకారంలా ఆతడు సర్వోన్నతస్వర్గము మధ్యతమ హృదయములో సమ భారస్థితి వహించి ఉన్నాడు. ఆతడు ఎవరు నిత్యజీవితుడో ఎవరు దినాలల్లో ప్రాచీనుడో ఆతనిమీద స్వాధికారాన్ని వెల్ల డించేటప్పుడు, ఆతని మహనీయతమ నామవైచిత్రిని గురించి ఆతడు మాట్లాడేటప్పుడు మరొకవేళ నేను ఆతని కంఠధ్వనిని వింటాను. ఆతడు దేవుడిగణనను గురించి కీర్తనలను ఉదాత్త స్వరముతో ఉచ్చరించేటప్పుడు సమస్తస్వర్గం ఆతని అందాన్ని తేరిచూడవలెనని ఆపేక్షతో రోదనచేస్తుంది; ఆతడు దేవుని ప్రశస్తి, మహత్త్వాలకు చెందిన పదాలను పాడేటప్పుడు సమస్త స్వర్గం ముద్దకట్టుకొనిపోయే చలిచేత కప్పబడ్డ కొండగుండెలో మంచుచేత పీడింపబడ్డట్లు చలనరహిత మౌతుంది. భూమి, సర్వం, అందులోని సమస్తం ఆతనిసేవకుల వ్రేలుమీది ఉంగరంలా తప్పక కనిపిస్తూవుంటే ప్రతిస్వర్గం ఆతని స్వీయ స్వర్గంలాగున ప్రతిఆకాశప్రదేశం ఆతని స్వీయాకాశ ప్రదేశం లాగున ఎక్కడ ఉన్నదో ఆ సూటియైన మధ్యేమార్గం వెంట సంచరిస్తున్నప్పుడు నేను ఆతని స్వప్నదర్శనాన్ని తలపోస్తు న్నాను. ఆతడు సృష్టికర్త, నిత్య సర్వాధికార ప్రభువు అయిన దేవుడు, మహిమాన్వితుడు. నిశ్చయంగా ఆతడు దేవుని సేవ కుడు, నీ ప్రభువైన దేవుని శేషానికి ద్వారము, సర్వాధికార సత్యము తప్ప ఇతర మేమీ కాదు. [పరిచ్ఛేదము XXIV]

6. దేవుడి సర్వశ్రేష్టశబ్దమైన ఓ నీవా! నీవు దుఃఖింపకు; భయపడకు; ఎందువల్లనంటే అత్యుత్తమ ప్రియతముల

పక్షంలో తెలుసుకున్నట్లు నీవు కోరేదానికి అనుగుణ్యం వహించి పురుషులుగాని స్త్రీలుగాని నీ పిలుపుకు ప్రత్యుత్తర మిచ్చినవా రందరికీ మేము పాపాలను క్షమిస్తామని నమ్మకంగా తెలియ జేశాము. నిశ్చయంగా ఆయన విజ్ఞానం సర్వవస్తువులను ఆకర్షించుకొన్నది. నిన్ను నా జీవితంలో నియమించుకొన్నాను: నీ ముఖాన్ని నావైపున నిలుపు: భయభావాన్ని వహించకు. రూఢిగా నీవు దివ్యసమాజంలో మహా ఘనమైనదానివి. నీ ఒక సత్యాన్ని గురించిన గుప్తవైచిత్రి జ్వలిస్తున్న పాదమధ్యంలో సృష్టిఫలకంమీద లిఖితమైనది. ఎంతవరకు ఆయనపాలన సమస్తసృష్టిలో సర్వోత్కృష్టతను కల్పిస్తుందో అందులోని ప్రజ లందరిమీది పరిపాలనత్వాన్ని ఎంతోకాలానికి ముందే దేవుడు నీమీద నిలుపుతాడు. [పరిచ్ఛేదం XXXI]

7. ఓ పాశ్చాత్య-ప్రజలారా! మీ మహానగరాలలో నుంచి బైటకు రండి; దేవుడి ప్రశస్తిని సమున్నతం చేస్తూ మన సంకే తాలను సత్యసమ్మతంగా విశ్వసించినట్టివారిని పోలినవారి కోసం క్షమాపణలు అన్వేషిస్తూ, ఆయనచుట్టూ తిరుగుతున్న దేవజాతులతో మేఘుచ్ఛాయలక్రింద, కారుణ్యప్రభువు మీ దగ్గ రకు వచ్చేరోజు దేవుడికి మీరు తోడ్పడండి. నిశ్చయంగా దేవుడు నిర్ణయంచేయటం జరిగింది; మాతృగ్రంథంలో ఇవ్వ బడ్డట్లు దేవుడి ఆజ్ఞలను బహిరంగం చేయటం జరిగింది.

మతవిశ్వాసంలోని సోదరులకోసం మీ హృదయాలు ముకు రాలు కావలెనని దేవుడు నిశ్చయంగా కోరుతున్నాడు కనుకను, అందువల్ల మీరు మిమ్మల్ని వారిలోను వారు వారిని మీలోను చూస్తారు గనుకను ఏ వ్యత్యాసం లేకుండా ఏకైకము, అవిభా జ్యము అయిన దేవునిమతంలో మీరు సత్యసోదరులవలె

రూపొందదండి. ఇది సర్వశక్తివంతుడైన దేవుని సత్యమార్గము; ఆయన రూఢిగా మీ చర్యలయెడ జాగరూకత వహిస్తాడు. [పరిచ్ఛేదము XLVI]

8. ఈ గ్రంథంలోని కంఠస్తము చేస్తున్న పద్యాలను విశ్వాసం కలవారు ఎన్నిమార్లు అప్పగిస్తుంటే విన్నా వారికళ్ళల్లో కన్నీరు పొంగిపొర్లుతుంటుంది; వారిహృదయాలు దేవునియెడ వారు వృద్ధిపొందించుకొన్న ప్రేమకు అత్యధిక జ్ఞాపకుడు సర్వప్రశస్తుడు అయిన ఆయనచేత గాఢంగా స్పృష్టింపబడతాయి. ఆయన దేవుడు, సర్వజ్ఞుడు, నిత్యుడు, వాడు సత్యంగా ఎల్ల వేళల ఎక్కడ నివసిస్తారో ఆ సర్వోన్నతస్వర్గంలో సహవాసులు. వారు స్థిరంగా అందులో దేవుడి దగ్గరనుంచి సాగిపోతున్నదీ, వారి జ్ఞానావరణానికి పైగా ఉన్నదీ అయిన దాన్ని తప్ప శూన్యాన్ని మాత్రమే దర్శిస్తారు. అక్కడ వారు తమను తమ పెదవులమీద పచరించే "శాంతి, శాంతి" శబ్దాలతో వారిని పలకరించే స్వర్గవిశ్వాసులను కలుసుకొంటారు.

ఓ విశ్వాససమాజమా! దేవుడి ఈ జ్ఞాపకము ప్రకటించే నా కంఠధ్వని వంకకు మీ శ్రవస్సులను నిలిపి వాల్చండి. నేను రూపొందించిన జ్ఞాపకమార్గము అతిసత్యానికి దేవుని, సూటిమార్గమనీ, నీతియుతమైన ఈ మతంకంటే మరొకదానిని ఎంతవాడు బహిరంగంగా పాటించినా న్యాయనిర్ణయదినాన్ని గణనచేయటానికి పిల్చినప్పుడు గ్రంథంలో లిఖింపబడ్డట్టుగా వాడు దేవుని ఏ ఇతరమతంవల్ల ఏ ప్రయోజనాన్నీ పొందలేడని తెల్సుకుంటాడనీ, నిశ్చయంగా, దేవుడు నాకు వెల్లడి చేశాడు........

ఓ రాజసమాజమా, మీరు దేవునియెడ భయభావాన్ని వహించండి; లేకపోతే ఆయన జ్ఞాపకశక్తి [బాబ్] అయిన అతడు ఆశ్చర్యోపేతమైన కంఠంతో మాట్లాడినట్టుగా గ్రంథం తోటి దేవుడిదగ్గరనుంచి సంకేతాలతో సత్యము మీదగ్గరకు వచ్చిన తరువాత మీరు ఆయన జ్ఞాపకశక్తి అయిన అతనికి కడుదూరమైపోతారు. ఆయనను విశ్వసించిన తరువాత దేని విశాలత సమస్తస్వర్గ మంతటి విశాలతో, అట్టి వనాన్ని దేవుడు మీకు నియమించాడు గనుక మీరు దేవుడి ఔదార్యాన్ని అన్వేషించండి. మాతృగ్రంథంలో నిర్ణీతమైనట్లు, ఈ అతి ప్రధానమైన హేతుసద్గుణం వల్ల సర్వశక్తివంతుడు ఔదార్యంతో ప్రసాదించిన బహుమతులు ఉపకరాలు తప్ప ఏ ఇతరాన్ని మీరు అందులో దర్శింపరు.

[పరిచ్ఛేదము LXIII]

9. మన ఆవిష్కరణకు సంబంధించిన కేవలం ఒక అక్షర ప్రాతినిధ్యం మూలంగా మన హేతుసత్యాన్నీ, ఒక కంటిరెప్ప పాటు కాలంలో ప్రపంచము, అందులోని సర్వస్వాన్నీ సమ్మతించటం మనకోరిక అయితీరాలి; అలా పట్టుదలపట్టడం మన శక్తిలో ఉన్నదికూడాను........

నీముందు *1 తిరస్కరించి నందుకు ముఖ్యశిష్యులు నిజంగా పరిహసింపబడ్డారు; నీవు సత్యశక్తివల్ల కాపాడబడే దేవుడి సేవకుడవుతప్ప ఇతరుడవు మరెవ్వరవు కావు. వారి చేతలు చేసినది +2 కారణంగా సత్యాన్ని తిరస్కరించిన వారి

*1 చూ. కొరాను 6 : 10

+2 చూ. కొరాను 3 : 172

దినాలను మనం చాలాముందు పొడిగిస్తాము; నిశ్చయంగా దేవుడు కాల-శిలమీది మచ్చ అంతం అయినా ఆయన ఎవరితోనూ అన్యాయంగా వ్యవహరించడు.

[పరిచ్ఛేదము LXXXVII]

10. ఓ భూప్రజలైన మీరా! ఆయన జ్ఞాపకత్వం వల్ల బాగా ప్రదర్శింపబడ్డ దృష్టాంతం సత్యమైనదైన దేవుని ధార్మికత్వంవల్ల ఎక్కడనుంచి ఆయన తన ఉత్కృష్టస్థితి శోభతో ప్రకాశిస్తాడో ఆ ఉన్నతమైన ఆకాశమధ్యస్థానానికి దయాప్రభునిహస్తం సూర్యుణ్ణి ఉన్నమితుడిని చేస్తుందో అక్కడి అతనిదగ్గరకు దగ్గరవలె గోచరిస్తుంది.

మేము పూర్వం పంపిన ప్రతిఒక్క ప్రవక్తతో దేవుడి జ్ఞాపకత్వానికి ఆతని రోజుకు సంబంధించిన ప్రత్యేకమైన ఒడంబడికను స్థాపించాము. ఆయన కారుణ్యాసనాన్ని చుట్టి చరించే గంధర్వుల కళ్ళముందు దేవుడి జ్ఞాపకత్వం, ఆతని రోజు కీర్తి రాష్ట్రంలో సత్యశక్తిమూలంగా ప్రత్యక్షమౌతున్నవి.

[పరిచ్ఛేదము XCI]

11. ఈ మతం నిశ్చయంగా దేవుడిదృష్టిలో మహమ్మదు విశ్వాససారము; కనుక ఏకైకస్వరూపుడైన దేవుడి ప్రత్యక్షాన దివ్యస్వర్గాన్ని, ఆయన అత్యుత్తమమైన సౌఖ్యోన్నతవనాన్ని పొందటానికి త్వరపడండి; దేవుడిసంకేతాలకు నిదర్శనాల ముందు మీరు ప్రశాంతిని కృతజ్ఞతను తప్పక వహించగలుగుతారు. [పరిచ్ఛేదము XLVIII]

12. పరిశుద్ధన్యాయానికి చిహ్నంలా మేము మన జ్ఞాపకత్వ హేతువుకు సంబంధించిన ప్రతిప్రవక్తకు నిశ్చయంగా వార్తలు

పంపించాము; సత్యంగా దేవుడు ప్రపంచంలోని సర్వప్రజల మీద సర్వశ్రేష్టుడు. [పరిచ్ఛేదము LXXXIII]

## పర్షియన్ బయాన్‌లోని భాగాలు

13. కొంతకాలం నడపబడ్డవ్యక్తి దివ్యైక్యతా వృక్షచ్ఛాయ క్రింద ఉండేటంతకాలం అతడు, అతడిని నడిపినవాడు దేవుడి కోమలకృపచేత పరిగ్రహింపబడ్డవారు అవుతారు గనుక మరణ సమయంలో భౌమవస్తువులను పొంది ఉండటం ఆగిపోతుంది: కనుక భూమిమీద ఉన్న సమస్తాన్నీ స్వాధీనం చేసుకోవటం కంటే ఒక వ్యక్తిని సక్రమంగా నడపటం ఉత్తమము. నడిపించటానికి మార్గం ప్రేమ, కారుణ్యాలకు సంబంధించింది గాని శక్తికీ, బలాత్కారానికీ సంబంధించింది కాదు; ఇది పూర్వకాలంలో దేవుడి పద్ధతి; భవిష్యత్తులోకూడా ఇది ఇలాగే సాగిపోతుంది! ఎవరు ఆయన దాక్షిణ్యచ్ఛాయలలో ప్రవేశించటానికి సంతోషపెడతారో అతనిని ఆయనే సంభవింపచేస్తాడు, నిశ్చయంగా ఆయన సర్వోన్నతరక్షకుడు, సమస్తోదారుడు.

ఏ ప్రాణికైనా ఆయన దినాన దేవుడి ప్రత్యక్షానికి కన్పించటంకంటే, ఆయన పద్యాలువిని వాటిని విశ్వసించటంకంటే దేవుడి అస్తిత్వంతప్ప అన్యంకాని ఆయన ఉనికిని పొందటంకంటే, ఆయన మహానంద దివ్యరాజ్య రత్నాకరంమీదప్రయాణం చేయుటకంటే, ఆయన దివ్యైక్యతాస్వర్గఫలాలను ఎన్నుకోవటంలో పాల్గొనటంకంటె అత్యాశ్చర్యకరమైన స్వర్గం వేరేలేదు. 11,16

---

11, 16 : బయాన్‌రచనలు 11, 16 సంఖ్యలలో సంబంధంగల వహిద్‌ల క్రిందికి, పరిచ్ఛేదాల క్రిందికి విభజితమైనవి.

14. నీ ఆరాధన నిన్ను అగ్నిదగ్గరకు నడిపించినప్పటికి నీ అర్చనావిధానంలో ఎట్టి మార్పు ఉత్పన్నం కానిరీతిలో నీవు వివేకంతో దేవుణ్ణి ఆరాధించు; నీ ప్రతిఫలం స్వర్గమయినా అదే విధానాన్ని అనుసరించు. ఏకైక సత్యస్వరూపుడైన దేవుడికి అది, అదిఒక్కటే, పూజావిధానం అయి ఉండవలె. నీవు భయం కారణంగా ఆయనను ఆరాధిస్తే అది పునీతమైన ఆయన ప్రత్యక్షసంస్థానసభలో సౌందర్యవిరహితంగా కనిపిస్తుంది; ఆయన అస్తిత్వైకత్వానికి అంకితులైపోయిన మీచేత అది ఒకచర్యగా పరిగణింపబడదు లేదా నీ దృష్టి స్వర్గంమీద ఉండవలసినట్లయితే, అట్టి ఆశమీద ప్రీతికలిగి ఉన్నప్పుడు నీవు ఆయనను ఆరాధింపవలసి ఉన్నట్లయితే స్వర్గం మానవులచేత ఆశింపబడుతున్న దన్న అంశాన్ని అడ్డుగా పెట్టుకోకుండా నీవు దేవసృష్టిని ఆయనతో భాగస్వామిని చేస్తావు.

అగ్ని, స్వర్గం రెండూ దేవుడిముందు వంగి సాగిలపడతవి. ఏది ఆయన సారయోగ్యత కలదో దానిని అగ్నిభయంగాని లేదా స్వర్గాశగాని లేకుండా ఆయనకోసం ఆయనను పూజించవలె.

సత్యమైన ఆరాధనను సమర్పించినప్పుడు ఆరాధకుడు అగ్నినుంచి బయట పడవేయబడ్డప్పటికీ, దేవుడి సత్సాన్నిధ్య స్వర్గాన్ని ప్రవేశింపజేయబడ్డప్పటికీ అతడి పూజాచర్యకు అట్టివి ఉద్దేశాలు కారాదు. ఏమైనప్పటికీ దేవుడి అనుకూలత, ఔదార్యం నిరంతరం ఆయన నిగూఢమైన వివేకపు ఆజ్ఞలను అనుసరించి సాగిపోతుంటవి.

అత్యుత్తమమైన ఆధ్యాత్మికతాశోభలతో సమర్పింపబడ్డ ప్రార్థనే మిక్కిలి అంగీకరింపదగ్గ ప్రార్థన; దాని పొడిగింపును

దేవుడు ఎన్నడూ ఇష్టపడలేదు; ఇష్టపడడు. అతిగా ఇతర సంబంధం లేనిదీ, స్వచ్ఛమైనదీ అయిన ప్రార్థనే దేవుడి ప్రత్యక్షతలో అధికతరంగా అంగీకరింపదగినది. VII. 9.

15. దివ్యైక్యతలో విశ్వాసంగలవారి అంచనాలో దేవుడి ఆజ్ఞలకు లోబడి వ్యవహరించటంకంటే మిక్కిలి ఉన్న తమైన స్వర్గం ఏదీ లేదు; అంతే కాదు—ఆయన నియమాలను ఉల్లంఘించేదానికంటేను, మరొక జీవుణ్ణి పీడించిందానిక టేను, దేవుణ్ణి ఆయన సంకేతాలను ఎరిగినవారి కన్నుల్లో అ గింజ అంతటిదైనా భయంకరాగ్ని లేదు. సత్యానికి దేవుడు పునరు త్థానంనాడు అందరు మానవులను న్యాయపరిశీలన చే ్తాడు; అతిరూఢిగా మనం అందరమూ ఆయన ఔదార్యంకోసం పునవి చేస్తాము. V. 19.

16. దేవుడు ఎవరు పవిత్రులో వారిని ప్రేమి ్తాడు. బయాన్‌లోని దేవుడిదృష్టిలోని శూన్యత పవిత్రత దోష హిత స్వచ్ఛతలకంటే అధికతరంగా ప్రేమింపబడుతున్నది ...... దేవుడు బయాన్ ప్రదానసమయంలో సంతోషాన్ని, తేజ స్సను కోల్పోయిన జీవుణ్ణి చూడటానికి ఇష్టపడడు. నిశ్చ యంగా అందరూ అన్ని పరిస్థితుల్లోను అటువంటి పవిత్రతతో అంత రికంగాను, బాహ్యంగాను అలంకరింపబడవచ్చుననీ ఇతరు లకు ఎంత తక్కువగా అనిష్టము గలిగింపబడ్డప్పటి . ఏ అసహ్యము తమకైనా కలిగింపబడకపోవచ్చుననీ యన ధానిని నిశ్చయముగా అభిలషిస్తాడు. V. 14.

17. మీ జీవితారంభం మొదలు తుదివరకు దేవు కోసం మీరు ఎన్నిపనులు చేసినా వాటిలో ఒకటికూడా ఎవరు దేవుడి

ప్రత్యక్షమో, ప్రతి మంచిపని ఎవరి దగ్గరకు చేరుతుందో ఆతడికోసం చేయలేదు. మీరు ఆవిధంగా చేసి ఉన్నట్లయితే ప్రత్యుత్థానం నాడు మీరు అంత తీవ్రంగా భయపడేవారు కారు

హేతువు ఎంత గొప్పదో మీరు గమనించండి; అయినా ప్రజలు అచ్ఛాదనలలో ఎంతగానో చుట్టివేయబడ్డారు. దేవుడికి అర్పింపబడ్డ ప్రతిప్రశస్తి, ప్రతిచర్యా ఎవరిని దేవుడు ప్రత్యక్షం చేస్తున్నాడో ఆతడికోసం చెల్లింపబడే ప్రశస్తి, చర్యా తప్ప అన్యం కాదని అతి పవిత్ర దైవప్రసారంమీద ప్రమాణం చేస్తున్నాను.

మీరు సచ్ఛీలురు కాకపోయినా దేవుడికోసం మేము సచ్ఛీలురంగా ఉన్నామని చెప్పుకుంటూ మిమ్మల్ని మీరు మోసగించుకోవద్దు. సత్యంగా దేవుడికోసం మీరు ఏ చర్యలు చేస్తున్నారంటే దేవుడు ఎవరిని ప్రత్యక్షంచేస్తాడో, ఎవరి పేరును గొప్పచేస్తాడో ఆతడి కొరకైన పనులు చేస్తున్నారు. సత్యజ్ఞానవిహీనులైన ఈ నగరవాసులు నిరంతరం "అక్కడ అసలు దేవుడు తప్ప మరొక దేవుడు లేడు" అని అంటుంటారు; ఇది వారికి ఏమి ప్రయోజనాన్ని కలిగిస్తుంది? మీరు ఆవిష్కరణ అరుణోదయసమయమైన అతనివల్ల ఆచ్ఛాదనలో కప్పబడ్డట్లుగా అడ్డుపెట్టరాదని కొంతసేపు పర్యాలోచన చెయ్యండి. VIII. 19.

18. దేవుడు సర్వసమయాలల్లో, సర్వపరిస్థితులల్లో ఆయన సృష్టించిన ప్రాణులకు సంపూర్ణంగా స్వతంత్రుడుగానే ఉంటాడు. సర్వమానవులు అత్యధికప్రేమతో ఆయన సర్వోద్యానాలను పొందవలె, ఒకరినొకరు క్షణకాలమైనా కష్టపెట్ట

కుండా ఉండవలె. ఎవరిని దేవుడు ప్రత్యక్షంచేస్తాడో ఆతని ఆవిష్కరణదినానికి సంబంధించిన అరుణోదయాన్ని సూచించే పునరుత్థానంనాటివరకూ అందరూ అయన రక్షణ భద్రతల ఉయ్యాలలో నివసించవలె అన్న కోరికను అయన ఎప్పుడూ వృద్ధిపొందించుకుంటాడు.

అయన తరువాతి ఆవిష్కరణకు, తరువాతి గ్రంథానికీ అంగీకార మివ్వటంకోసం అందరు మానవులను పిలుస్తూ వారిలో అయన గుప్తసమాజాన్ని స్థాపిస్తే తప్ప విశ్వప్రభువు ఎన్నడూ మతప్రవక్తను నిలుపలేదు: లేదా గ్రంథాన్ని పంపించలేదు; ఎందువల్లనంటే – అయన దాతృత్వప్రకటనలకు నిలుపుదల లేకపోవటంవల్ల; వాటికి పరిమితి లేకపోవటంవల్ల. VI. 16.

19. ప్రతిశాస్త్రంలోని విజ్ఞానాన్ని అనంతంగా ఆర్జించిన ప్రజల సంఖ్యాధిక్యత ఎంత ఉన్నా ప్రతిశాస్త్రఫలము, దివ్య ధర్మనియమజ్ఞానము, అయన మనోజ్ఞసౌఖ్యానికి అధీనం కావటం తప్ప ఇతర మేమీ కాకపోవటంవల్ల, దేవుని పవిత్ర శబ్దాన్ని అనుసరించటమే వారి విశ్వాసాన్ని నిర్ణయిస్తుంది.
II. 1.

20. ఓ బయాన్ ప్రజలారా! మీ జాగ్రత్తలో ఉండండి; ఎందువల్ల నంటే పునరుత్థానదినాన పరుగెత్తిపోవటానికి ఎవ్వరికీ ఒకస్థానం కనిపించదు. అతడు హఠాత్తుగా ప్రవేశించి ఆతని ఇష్టానుసారంగా నిర్ణయాన్ని ప్రకటిస్తాడు. అతడికి కోరిక కలిగితే భంగపడ్డవాళ్ళను ఉన్నతులనుగాను, ఉన్నతులను భంగపడ్డవాళ్ళనుగాను చేస్తాడు; బయాన్‌లో అతడు

చేసినట్లుగానే చేస్తే మీరు తెలుసుకోవటంమాత్రమే చేయగలరు. ఇందుకు ఆతడుతప్ప ఇతరులు మరెవ్వరూ సమానులు కారు. ఆతడు ఏది విధిస్తే అది నెరవేర్పబడుతుంది; ఏదీ నెరవేర్ప బడకుండా మిగలదు. VII, 19.

21. సమస్తజనం ఆయన దివ్యత్వప్రభుత్వాల సంకేత చ్ఛాయనుంచీ బహిర్గతులైనారు గనుక వారు ఎప్పుడూ గంభీరము, ఉన్నతమూ అయిన మార్గాన్ని గ్రహించటానికి ఉద్దేశపడతారు. మరి వారు తమ ప్రియుణ్ణి గుర్తించగలగటానికి దర్శింపగల నేత్రాలన్ని పోగొట్టుకుంటారు. గనుక ఆయనయెడ నమ్రత వినయాలను ప్రదర్శించటమనే వారికర్తవ్యం విషయంలో పతనాన్ని పొందుతారు. అయినప్పటికీ వారు తమ జీవితాల ఆరంభంనుంచీ చివరదాకా పూర్వమతంలో ఏర్పాటు చేయబడ్డ నియమాలకు అనుగుణంగా దేవుణ్ణి పూజిస్తారు: ఆయనను పవిత్రంగా అర్చిస్తారు; ఆయన దివ్యనిత్యత్వం ముందు నమ్రులై ఆయన ఉన్నతతత్వంయెడ విధేయతను ప్రదర్శిస్తారు. ఏమైనా వారు ఆయనను కేవలం తమకు వలెనే ఒకడని వింతగా పాటించడంవల్ల వారందరూ ఆయనప్రత్యక్షమయ్యే ఘడియలో వారిదృష్టిని తమవైపుకు మాత్రమే త్రిప్పుకుంటారు. ఇట్టిపోలిక దేవుడి ప్రశస్తికి ఎంతో దూరమైనది. ఆ మహనీయస్థితుడు భౌతిక సూర్యుని పోలిక కలవాడు; ఆయన పద్యాలు రవికిరణాలు; ఆయన విశ్వాసులు అందరూ, వారు ఆయనను గురించి సత్యంగా విశ్వసించవలె – విశ్వాసులందరు సూర్యుడు ప్రతిబింబించే అద్దాలవలె ఉన్నారు. అందువల్ల వారివెలుగంతా కేవలం ప్రతిబింబము. VII, 15.

23. ప్రతిప్రార్థన అయినతరువాత సేవకుడు తన తల్లి దండ్రులయెడ దయను క్షమాపణను ప్రసాదించ మని బ్రతిమి లాడటం సముచితము. అప్పుడు "దేవుడు" నీ తల్లిదండ్రుల కోసం "నీవు అడిగినవి వేలవేలుగా నీకు ఫలిస్తవి" అన్న ప్రవచనాన్ని కంఠాన్ని పెంపొందించి పలుకుతాడు. దేవుడితో సంభాషించేటప్పుడు తన తల్లిదండ్రులను జ్ఞప్తిలో ఉంచుకొనే వ్యక్తి అనుగ్రహింపబడతాడు. శక్తివంతుడు, ఉత్తమ ప్రేమయుతుడు, అయిన ఆయనతప్ప నిశ్చయంగా మరొక దేవుడు లేడు. VIII – 16.

24. ఈ భౌతికమైన అకారం ఆంతరిక దేవాలయ సంబంధ మైన ఆసనం కావటంవల్ల తొలిదానిలో ఏది జరిగినా, తరువా తది దానిని అనుభవిస్తుంది. వాస్తవానికి సంతోషంవల్ల ఉల్లా సాన్నీ; బాధవల్ల దుఃఖాన్నీ పొందేది శరీరానికి సంబంధించిన ఆంతరికమైన ఆలయంకాని శరీరంకాదు. ఈ భౌతిక శరీరం ఎక్కడ ఆంతరిక ఆలయాన్ని స్థాపిస్తుందో అది ఆసనం కావటంవల్ల సహించరానిదాన్ని దెనినీ అనుభవించకపోవటం కోసం దేవుడు అవకాశం ఉన్నంతవరకు ఈ శరీరాన్ని జాగ్రత్త పెట్టమని ఆజ్ఞాపించాడు. ఆంతరిక ఆలయం తన ఆసనమైన భౌతికశరీరాన్ని దర్శిస్తుంది. ఈ విధంగా తరువాతి దానికి గౌరవ మిచ్చినట్లయితే పూర్వపుది, దానిని పుచ్చుకొన్న దైనట్లే అవుతుంది. ఈ విధంగా విపర్యయం సత్యమౌతుంది.

అందువల్లనే మృతశరీరాన్ని అత్యధికమైన గౌరవమర్యాద లతో ఆదరించవలెనని శాసించటం జరిగింది. V, 12.

25. సత్యసంధుడైన ఏకైక దేవుణ్ణి సూర్యునితోను, విశ్వా సిని అద్దంతోను పోల్చవచ్చు. సూర్యుడిముందు అద్దాన్ని

23. ప్రతిప్రార్థన అయినతరువాత సేవకుడు తన తల్లి దండ్రులయెడ దయను క్షమాపణను ప్రసాదించమని బ్రతిమి లాడటం సముచితము. అప్పుడు "దేవుడు" నీ తల్లిదండ్రుల కోసం "నీవు అడిగినవి వేలవేలుగా నీకు ఫలిస్తవి" అన్న ప్రవచనాన్ని కంఠాన్ని పెంపొందించి పలుకుతాడు. దేవుడితో సంభాషించేటప్పుడు తన తల్లిదండ్రులను జ్ఞప్తిలో ఉంచుకొనే వ్యక్తి అనుగ్రహింపబడతాడు. శక్తివంతుడు, ఉత్తమ ప్రేమయుతుడు, అయిన ఆయనతప్ప నిశ్చయంగా మరొక దేవుడు లేడు. VIII – 16.

24. ఈ భౌతికమైన అకారం ఆంతరిక దేవాలయ సంబంధ మైన ఆసనం కావటంవల్ల తొలిదానిలో ఏది జరిగినా, తరువా తది దానిని అనుభవిస్తుంది. వాస్తవానికి సంతోషంవల్ల ఉల్లా సాన్నీ; బాధవల్ల దుఃఖాన్నీ పొందేది శరీరానికి సంబంధించిన ఆంతరికమైన ఆలయంకాని శరీరంకాదు. ఈ భౌతిక శరీరం ఎక్కడ ఆంతరిక ఆలయాన్ని స్థాపిస్తుందో అది ఆసనం కావటంవల్ల సహించరానిదాన్ని దేనినీ అనుభవించకపోవటం కోసం దేవుడు అవకాశం ఉన్నంతవరకు ఈ శరీరాన్ని జాగ్రత్త పెట్టమని ఆజ్ఞాపించాడు. ఆంతరిక ఆలయం తన ఆసనమైన భౌతికశరీరాన్ని దర్శిస్తుంది. ఈ విధంగా తరువాతి దానికి గౌరవ మిచ్చినట్లయితే పూర్వపుది, దానిని పుచ్చుకొన్న దైనట్లే అవుతుంది. ఈ విధంగా విపర్యయం సత్యమౌతుంది.

అందువల్లనే మృతశరీరాన్ని అత్యధికమైన గౌరవమర్యాద లతో ఆదరించవలెనని శాసించటం జరిగింది. V, 12.

25. సత్యసంధుడైన ఏకైక దేవుణ్ణి సూర్యునితోను, విశ్వా సిని అద్దంతోను పోల్చవచ్చు. సూర్యుడిముందు అద్దాన్ని

సర్వకృపాపరిపూర్ణుడు, సర్వౌదార్యసమేతుడు. అనుమాన రహితమైన విశ్వాసంతో నీవు నమ్మినట్లయితే అల్లా చేయటంలో విజయంపొందుతామని నీవు గ్రహించు. ఏమయినప్పటికీ మధ్యలో జోక్యం కలిగించుకొనే నీ స్వార్థపరమైన యవనికల వల్ల నీవు అనుమానరహితమైన విశ్వాసస్థితిని పొందలేవు గనుక నీవు దానిని గమనించకపోయినా నీవు అగ్నిలో వెనుక ఉండిపోతావు నీతియుతమైన ప్రతిచర్యను నిర్వహించినా నీవు ఆతడి విషయంలో సత్య సమ్మతంగా విశ్వాసం వహించక పోతే అతని ప్రత్యక్షంనాడు నీవు నిన్ను అగ్నినుంచి రక్షించుకోలేవు. నీవు సత్యాన్ని ఆలింగనం చేసుకొన్నట్లయితే ప్రతి ఉత్తమమయినదీ, యుక్తమయినదీ నీకోసం దేవగ్రంథంలో ఏర్పరచబడి ఉంటుంది: దీని సద్గుణంవల్ల రాబొయ్యే పునరుత్థానంవరకు నీవు సమస్తమయిన అత్యుత్తమ స్వర్గంలో సౌఖ్యాన్ని అనుభవిస్తావు.

స్వర్గలోకాలు, భూమి, వాటిమధ్య ఉండే ప్రదేశంకంటె అతి విపులమైనది అయిఉన్న మార్గం మిక్కిలి సంకటమైనది కావటంవల్ల దానిని తగినశ్రద్ధతో పర్యవేక్షించు. ఉదాహరణానికి జీసస్ వాగ్దానసంసిద్ధిని ఉద్దేశించేవారందరు దేవప్రతినిధియైన మహమ్మదు ప్రత్యక్షీకరణాన్ని గురించి నమ్మకం కలిగించి ఉన్నట్టయితే ఒక్కరుకూడా జీసస్ మాటలకు వ్యతిరేకంగా తిరగగలిగేవారు కారు. అందువల్ల ఇదేవిధంగా బయాన్ పునరుత్థానాంశం విషయంలో దేవప్రతినిధి ముందుగా ఎవరిని వెల్లడించాడో ఆ వాగ్దత్తుడు అయిన మెహిది [దైవోపదేశంతో నడపబడేవాడు] ఇతడే అని అందరికి నమ్మకం కలిగిస్తే ఖురాన్‌ను విశ్వసించేవాళ్ళలో ఒక్కరుకూడా దేవప్రతినిధి

ప్రవచనాలకు వ్యతిరేకించి నడిచేవారు కారు. అందువల్ల ఇవే విధంగా దేవుడు ప్రత్యక్షీకరింపజేసే అతని పునరుత్థాన విషయంలో ఇదే విషయాన్ని గమనించు; అతడు "ఎవరిని దేవుడు ప్రత్యక్షీకరిస్తాడని "బయాన్ అంశం ముందే తెలియజెప్పిందో ఆ అతడేనని అందరికీ నమ్మకం కల్గించినట్లయితే, ఒకరుకూడా ప్రక్కకు తిరిగేవారు కారు. IX, 3.

## దలా ఇల్ ఇ సభీలో నుంచి స్వీకరించిన గ్రంథభాగాలు

27. మతము, దాని నియమాలకు దాని ప్రధానాంశాల గురించి నీవు తెలుసుకోవటానికి అడిగినావు : మతంలో ప్రథమమైనది, అతి ప్రధానమైనది దైవజ్ఞాన మని తెలుసుకో. ఇది సర్వోత్కృష్ట మహనీయతా పీఠమైన ఆయన పరమ పవిత్ర మాననీయ పుణ్యగృహం సర్వలక్షణాలవల్ల పరిశుద్ధం చేయబడ్డదని జయనినాదాలు చేయటంతో ఏది తన వర్తనవల్ల సంసిద్ధిని చెందిందో ఆ ఆయన దైవికమైన ఐకమత్యాన్ని అంగీకరించటంలో ఉపయోగవహనాన్ని పొందుతుంది. అంతే కాక ఉంటూవున్న ఈ ప్రపంచంలో దైవిక వాస్తవ్యానికి అరుణోదయమైన అతనికి సంబంధించిన విజ్ఞానంవల్ల తప్ప మరోవిధంగా దైవిక విజ్ఞానాన్ని పొందే వీలులేదని నీవు తెలుసుకో.

28. ఔదార్యదేవా ! ఇస్లాంరాజ్యాలల్లో ప్రస్తుతం ప్రపంచాన్ని పాలించే ఏడుగురు శక్తివంతులైన సార్వభౌములున్నారు. వీరిలో ఎవరికీ అతని [బాబ్ యొక్క] ప్రత్యక్షీకర

ణాను గురించి తెలియజేయటం జరగలేదు; అంతేకాక తెలియజేసిన ఎవరూ అతణ్ణి విశ్వసించలేదు. ఎరిగినవాళ్ళు కాంక్షాపరిపూర్తితోను, ఏ విషయంకోసం తాము కనిపెట్టుకొని ఉంటున్నారో అది గడిచిపోవటానికి వచ్చిందని గుర్తుపట్టకుండాను ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టిపోవచ్చు. శుభవార్త వంకకు వేగతనాన్ని వహించిన చక్రవర్తుల విషయంలో ఇదే జరిగింది. వారు దేవుని ప్రవక్త [మహమ్మదు] రాకకోసం కనిపెట్టుకొని ఉన్నారు; కాని ఆతడు దర్శనమిచ్చినపుడు వారు ఆతడిని గుర్తుపట్టడంలో జయాన్ని పొందలేకపోయినారు. వారికి అధీనమైన దేశాలల్లోనే దేవుడు ప్రత్యక్షీకరణతో వారికి పరిచయం కలిగించటమనే కృత్యాన్ని వృత్తిభారం చేసి ఒక ఉద్యోగిని నియమించటమనే అతిస్వల్ప భావాన్నైనా వహించకుండా వ్యయంచేసే ధనసంచయాలు ఎంత పెద్దవో గమనించండి! అందువల్ల దేనికోసం వారు సృష్టింపబడ్డారో ఆ ప్రయోజనాన్ని వారు పరిపూర్తిచేసారు. వారి సమస్తమైన అభిలాషలు వారి తదనంతరం వారి నామచిహ్నాలను విడిచిపెట్టటానికి స్థాపింపబడ్డాయి; ఇంకా స్థాపింపబడుతున్నవి.

29. నన్ను నీకోసం కొన్ని వివేకవిశిష్టమైన వాదోపవాదాలను నిరూపించనిమ్ము. ఈనాడు ఒకడు ఇస్లాం మతాన్ని స్వీకరించటాన్ని కోరితే దైవ ప్రామాణ్యం దానిని స్వీకరించటాన్ని నిష్కర్షగా నిరూపింప గల్గుతున్నవా? అవి నిరూపించలేదని నీవు భావిస్తే దేవుడు మరణానంతరం అతణ్ణి ఎలా దండిస్తాడు?; అతడు జీవిస్తుండగా అతడిమీద "అవిశ్వాసి" అన్న తీర్పును వర్తింపచేయటం ఎలా జరుగుతుంది. దేవుడి సాక్ష్యం నిష్కర్ష అయినదని నిర్ణయించే నీవు దాన్ని ఎలా

నిరూపించగలవు ? నీ స్థిరపరచటం వినికిడిమీద ఆధారపడితే కేవలం మాటలను, బంధితమైన ప్రమాణంగా అంగీకరించ టానికి విలులేదు; కాని నీవు కురాన్‌ను ప్రమాణంగా ఎంచితే ఇది శక్తివంతము, నిరూపణాత్మకము అయిన నిదర్శనం అవుతుంది.

ఇప్పుడు బయాన్ ఆవిష్కరణను గురించి భావించే కురాన్ అనుసరించేవారు ఇస్లాం అవిశ్వాసుల ఎడ తాము వర్తింపజేసే నిదర్శనాల వంటివాటినే తమఎడ కూడా వర్తింపచేసుకున్నట్లైతే ఒక వ్యక్తికూడా సత్యవిహీనుడయ్యేవాడు కాడు; అంతేకాక ప్రత్యుత్థాన దినాన ప్రతిఒక్కరు ముక్తిని పొందేవారు.

"నేను కురాన్‌ను అర్థం చేసుకోలేక పోతుంటే దానిని ఎలా ప్రమాణగ్రంథంగా పరిగ్రహింప గలనని ఒక క్రైస్తవుడు భావిస్తే అటువంటి వాదన అంగీకారయోగ్యమైనది కాదు. ఇదే విధంగా కురాన్ ప్రజలు తిరస్కారబుద్ధితో "మేము బయాన్‌లోని పద్యాల వాగ్వైశిష్ట్యాన్ని గ్రహించలేనప్పుడు దానిని ప్రమాణంగా ఎలా గౌరవించగలము" అని అంటారు. అటువంటి మాటలు ఎవరు పల్కినా అతడితో "ఓ శిక్షణ శూన్యుడా! నీవు ఏ నిర్ణయాన్ని అనుసరించి ఇస్లాం మతాన్ని గ్రహించావు ? అతడు నీవు ఎన్నడూ కనులు నిల్పిచూడని ప్రవక్తయేనా ? అవి నీవు ఎన్నడూ దర్శించని అమానుష చర్యలా ? నీవు జ్ఞానరాహిత్యంతో ఇస్లాం మతాన్ని స్వీకరిస్తే ఎక్కడ అలా చేశావు? కానీ నీవు కురాన్‌ముందు విద్వాంసులు, విశ్వాసపరిపూరితులు తమ శక్తిహీనతను వ్యక్తం చేసుకోటాన్ని వినటంచేత దానిని ప్రమాణంగా అంగీకరించటం

వల్లా లేదా దైవ పద్యాలను వినటంవల్లా మతాన్ని స్వీకరించిన ట్లయి దేవుని సత్యవచనం మీద నీకున్న స్వేచ్ఛాపూర్వక ప్రేమ సౌశీల్యం వల్ల కేవల వినయ నమ్ర భావంతో – సత్య ప్రణ యు జ్ఞానాలకు చిహ్నమైన భావంతో – ప్రత్యుత్తరమివ్వటం అన్న ఇటువంటి నిదర్శనాలు ఉన్నవి; అవి గాఢమైనవి; ఎల్లప డు గౌరవాన్ని పొందుతాయి" అని అనండి.

3 . ఏమైనా, దైవానికి సంబంధించిన సంబంధం తప్ప మిగిలిన సంబంధాలను అన్నిటినీ నీవు విడిపించుకో; ఆయ నకు సంబంధించింది తప్ప మిగిలినవాటి నన్నిటినీ త్రోసిపుచ్చి దైవ సంపన్నత కలవాడివి కమ్ము; ఈ ప్రార్థనను పఠించు.

ఇ అను : దేవుడు సర్వవస్తువులమీది సర్వవస్తువులకు తృప్తి క గిస్తాడు; అంతేకాదు – స్వర్గాలలో, లేదా భూమిలో లేదా వీటి రె టికీ మధ్యలో ఉన్న శూన్యానికీ, దేవుడు తప్ప ఏమున్నా దానికీ త ప్తికలిగిస్తాడు. నిశ్చయంగా ఆయన ఆయనలోనే జ్ఞాని, పోష కు , సర్వశక్తియుక్తుడు.

దే ుడి సర్వసమర్థమైన శక్తిని వ్యర్థమైన కల్పనాచిత్ర విభ ంగా పాటించకు. అది దేవుడి ప్రత్యక్షతకు జరిగే ప్రతి ధిలోను నీవు అనురాగంతో తిలకించే పరిశుద్ధమైన విశ్వా ము. అలా ఉండగా నీకు విశ్వాసం తప్ప భూమిమీద సృజి పబడ్డ ఏవస్తువైనా తృప్తిని కలిగించదు గనుక అది సృజి పబడ్డవాటి అన్నిటికంటె తృప్తిని కలిగించే విశ్వాసము. నీవు విశ్వాసరహితుడవైతే దివ్యసత్యవృక్షం వినాశాన్ని పొం మని నిన్ను నిషేధిస్తుంది. నీవు విశ్వాసివి గనుక అయితే

నీ విశ్వాసం భూమిమీద ఉండే సమస్త వస్తువులను మించి నీకు సరిపోతుంది.

31. సమస్త క్రైస్తవసమాజంలో డెబ్బదిమందిని మించని వారు దైవశిష్యుని మతాన్ని స్వీకరించారని జనశ్రుతిలో లిఖితమైనది. వారు విశ్వసిస్తే దేశంలోని సామాన్యజన సముదాయమంతా వారిని అనుసరించి ఉండేవారు; నింద వారిపండితుల మీద పడి ఉండేది. అయితే తరువాత గడవటానికి ఏమి సంభవించటం జరిగిందో గమనించు. క్రైస్తవ ప్రపంచంలోని పండితులు క్రీస్తుబోధను భద్రంగా రక్షించడమనే సౌశీల్యం వల్ల విద్వాంసులు స్వస్థపరచటం జరిగింది; అయినా మానవులు మతాన్ని అంగీకరించడంలోను, ముక్తిని గ్రహించడంలోను అపజయాన్ని పొందటంలోను ఎలా వారికి వారే కారణులైనారో నీవు గమనించు. వారి అడుగుజాడలను అనుసరించటం, ఇంకా నీ కోరికేనా? జీసస్ అనుచరులు ప్రత్యుత్థాన దినంనాడు రక్షింపబడటానికి వారి మతాచారులకు లొంగిపోయారు; ఈ అణుకువ ఫలితంగా వారు చివరకు అగ్నిలో ప్రవేశించారు. అంతేకాక దేవశిష్యుడు కన్పించిన రోజున వారు ఆ మహోన్నత వ్యక్తిని గుర్తించటం నుంచి తమ్ముతాము కప్పివేసుకున్నారు. నీవు అటువంటి దివ్యులను అనుసరించటాన్నే అపేక్షిస్తున్నావా?

దైవప్రమాణంగా నీవు వివేచన లేకుండా దివ్యుడవు కావటం కానీ, వివేచన లేకుండా అనుచరుడవు కావటంకానీ చేయవద్దు; ఎందువల్లనంటే ఇలాంటి ఇద్దరూ పునరుత్థాన దినంనాడు వినాశం అవుతారు కనుక. సత్యసంబద్ధుడైన మతనాయకుడి ఆజ్ఞను అనుసరిస్తూ వివేకవంతుడైన దివ్యుడవు కావటం

కానీ, దేవునిమార్గంలో పరిచయంతో చరించటం కానీ ఇంత కంటే నీకు ఎంతో లాభకరము.

నీవు ప్రతిదేశంలోను సత్యవివేచనము లోపింపచేసుకొన్న అసంఖ్యాకులైన పారమార్థిక నాయకులను గమనిస్తావు; ప్రతి ప్రజలలోను యోచించి పర్యాలోచన చేసే శీలంలేని అనేకవేల ఏకమతపక్షానుచరులను నీవు ఎదుర్కొంటావు. నీ హృదయంలో కొంతకాలము యోచనతో పర్యాలోచన చేయుము; నీవు నీమీద కరుణవహించు: నీ శ్రద్ధను నిర్ణయాలనుగురించి ప్రక్కకు త్రిప్పకు. ఏమైనా వ్యాపారరహితకల్పనలు చేసి నిర్ణయాలను నిదర్శనలను వెదుకకు; కానీ దేవుడు వేటిని నీకు మేలునుగూర్చే నిర్ణయాలను నియమించాడో వాటిమీద ఆధారపడండి. అంతేకాక విజ్ఞానవంతుడు కావటంకాని, అనుచరుడు కావటంకాని దాని అంతట అది కీర్తిహేతువు కాదు. నీవు విజ్ఞానంకల వ్యక్తివైతే నీ విజ్ఞానం గౌరవనీయం కావటం, నీవు అనుచరుడవు అయితే నాయకత్వాన్ని అనుసరించటం గౌరవం కావటం అన్నవి దేవుడి అత్యుత్తమ సౌఖ్యానికి అనుగుణమైనవి అయినప్పుడే జరుగుతవి. అంతేకాదు జాగ్రత్తవహించు: లేకపోతే నీవు దేవుడి అత్యుత్తమ సౌఖ్యాన్ని వ్యర్థకల్పనగా భావిస్తావు: అది ఆయన వార్తావహుని అత్యుత్తమసౌఖ్యంతో సమానమైనది. జీసెస్ అనుచరులను పరీక్షించు; వారు దేవుని సౌఖ్యాన్ని వేగంగా అన్వేషించారు; కానీ వారిలో ఎవ్వరూ ఆయన మతాన్ని అనుసరించటం వంటివి తప్ప దేవుడి అత్యుత్తమ సౌఖ్యంతో అభిన్నమైన శిష్యుని అత్యుత్తమ సౌఖ్యాన్ని సంపాదించారు కారు.

## కితాబ్–ఇ–ఆస్మా నుంచి స్వీకరించిన గ్రంథభాగాలు

32. ఒక హేతువుయెడ అధికారాన్ని ఉంచి ఒక వ్యక్తి అతడి నిర్ణయాలను ఉత్పత్తి చేసినప్పుడు ఎవరు ఆతణ్ణి తిరస్కరింపదలచారో వారు అతడి నిర్ణయాలవంటి నిర్ణయాలను ఉత్పత్తిచేయవలసిన అగత్యం ఉన్నది. అలా చేయటంలో వారు విజయాన్ని పొందితే అతనిమాటలు వ్యర్థమౌతాయి; వారివి చెల్లుబడి అవుతాయి; లేకపోతే అతడిమాటలు నిలిచిపోవు: లేదా ఆతడు రూపొందించిన నిదర్శనాలు నిరర్థకాలు కావు. ఓ బయాన్‌ను సంచయంగా గల మీరా! నేను మీకు బోధచేస్తున్నాను; మీరు మీ అధికృతను తృప్తితో సుస్థిరం చేసుకున్నట్లయితే ఏ వ్యక్తినైనా ఆతడు ఎత్తిచూపిన నిర్ణయాలకు తుల్యమైన నిర్ణయాలను చూపించకుండా ఎదుర్కొవద్దు: ఎందువల్లనంటె ఆ సమయంలో స్థిరమైనది ఏదైనా నిశ్చయంగా నాశమొందుతుంది; సత్యం దృఢంగా స్థాపితమైతీరుతుంది. ఎవరు దేవశిష్యుడైన మహమ్మదుతో చర్చలకు పూనుకున్నారో అతనికోసం దేవుడు పంపించిన వాటికి సమానమైన నిర్ణయాలను తీసుకొనిరావటానికి యత్నించటంలో తగినంత శక్తిహీనులు కావటంవల్ల, ఫలితంగా శూన్యానికి తగ్గింపబడ్డారో ఆ ప్రజలు ఎంతో అసంఖ్యాకులు. వారు అవమానంతో చెల్లాచెదరైనా నమ్రత వహించినా అయన వేటితో వ్యవహరిస్తాడో ఆ నిర్ణయాల స్వభావాన్ని వారు గ్రహించినట్లయితే వారు ఎన్నడూ అయనను ఎదుర్కొనేవారు కారు. కానీ వారు తమను తమ మతానికి సంబంధించిన వీరులనుగా

ాపించారు; అందువల్ల దేవుడు వారి యోగ్యతలను అనుస ంచి తన అధికారములో నిలుపుకొని సత్యాన్ని సత్యాధికారం ్వారా సాధించాడు. మీరు ఈనాడు మహమ్మదీయ ఆవిష్కరణ ంలో స్వచ్ఛరూపంతో దర్శించేది ఇదే.

వారిమీద ఉనికి సమస్తం పరిపూర్ణంగా ఆధారపడి ఉన్న ్రుడు ప్రతి దైవవిద్యలోను మహోన్నతాలైన 'వాస్తవికత – ాసనాలను' ఆక్షేపింపగల వ్యక్తి మీలో ఎవరు? నిశ్చయంగా ాారంభంలేని ప్రారంభకాలం నుంచి ప్రస్తుతపు ఈనాటివరకు ెవరు వారిని ఎదుర్కొన్నారో దేవుడు వారిని తుడిచిపెట్టాడు; ిరిణామంగా సత్యాన్ని సత్యశక్తితో ప్రదర్శించాడు. ఆయనే ాకల బలవంతుడు, సర్వశక్తివంతుడు, సమస్తాధికారి.

XVII. 11.

33. ప్రతి ఆవిష్కరణా ప్రత్యక్షమయ్యే సమయంలో ంత్యాన్ని తెలుసుకోటంలో అపజయాన్ని పొందినవారి హృద యాలు వారు తమను ఆయన దగ్గరనుంచీ మూసివేసుకోటం కారణంగా ఇబ్బందిలో పడ్డప్పుడు ఆవిష్కరణకర్తయెడ ఎవరు వారి హృదయాలను వివృతంచేస్తారో వారు సత్యాన్ని ఎరిగినదానినిగా ఎలా తెలుసుకుంటారో గమనించు. ఏమైనా ఉభయపక్షాలవారికీ హృదయవివృతత్వం దేవుడిచేత ఒకే విధంగా అనుగ్రహింపబడ్డది. దేవుడు సర్వప్రాణుల సృష్టికర్త కావటంవల్ల ఆ ప్రాణి ముసుగుల్లో చుట్టబడ్డందుకు తానే బాధ పొందుతున్నప్పుడు తప్ప, ఎప్పుడూ అది చీమ అయినా, దాని హృదయం ఉత్తమప్రాణి హృదయంకంటే ఎంత చిన్న దయినా దేని హృదయాన్నీ ఇరుకులో పెట్టటానికి ఇష్టప ్డ

దేవుడు ప్రత్యక్షీకరించే అతని హేతువును స్వీకరించేటట్లుగా మీరు ఏ ఒక్క వ్యక్తి హృదయాన్నైనా వివృతంచేయటానికి పూనుకుంటే మీ అంతరాత్మలు ఆ మహాత్ముని నామోద్రేకాలతో నిండిపోతవి. అందువల్ల పునరుత్థానదినాలల్లో ఈ పనిని నిర్వహించటం మీమీద పడుతుంది. ఎందువల్లనంటే అత్యధిక ప్రజలు సహాయం లేనివారు కావటంవల్ల మీరు వారి హృదయాలను వివృతంచేసి వారి అనుమానాలను పారద్రోలటంవల్ల వారు దేవుని మతంలో ప్రవేశిస్తారు. అందువల్ల మీరు దేవుడు ఎవరిని ప్రత్యక్షీకరిస్తాడో అతని దినాలల్లో మీ అత్యధిక సామర్థ్యంతో ఈ గుణాన్ని స్పష్టంచేయండి. ఎందువల్లనంటే రూఢిగా మీరు ఒక వ్యక్తిహృదయాన్ని అతనికోసం వివృతం చేయాలనుకుంటే అది మీకు మీ ప్రజాధర్మకార్యంకంటే అత్యుత్తమమైనదై వ్యవహరిస్తుంది. ఎందువల్లనంటే చర్యలు అతనిలోని విశ్వాసంకంటే అతనిలోని వాస్తవికత్వాన్ని దర్శించటానికి రెండవవి మాత్రమే అవుతాయి కనుక (XVII. 15)

34. "శుభవర్తమానాన్ని" ఏ ప్రజలకు ఇవ్వబడిందో వాళ్ళనుగురించి పర్యాలోచన చేయండి; వారి మతనాయకులు సత్యమైన శుభవర్తమాన దర్శకులని భావింపబడ్డారు; కానీ వారు దేవశిష్యుడైన మహమ్మదునుంచి తమను కప్పుకొని మూసివేసికొన్నపుడు, స్వర్గాన్ని పొందటంకోసం వారు జీవితమంతా విశ్వాసంతో వారి మతనియమాలను అనుసరించినవారు అయినప్పటికీ దోషమార్గోపదేశకులుగా మారిపోయారు: తరువాత దేవుడు వారికి తెలిసిన స్వర్గాన్ని సృష్టించిన సమయంలో వారు అందులో ప్రవేశించలేదు. కురాను ఎవరికి ఇవ్వబడిందో వారూ ఇదేవిధంగా అపక్వస్థితిని పొందారు.

దేవుడు తమను న్యాయోపేతమైన స్వర్గాన్ని జేరటానికి పుష్టి గలవారిని, శక్తివంతులను చేస్తాడని ఆశిస్తూ ఆయనకోసం తమ ఉపాసనాచర్యలను ఆచరించారు. ఏమైనా వారి ముఖాల ముందు స్వర్గద్వారాలు రువ్వన తెఱవబడ్డా వారు దానిలో ప్రవేశించటాన్ని తిరస్కరించారు. వారు అగ్నినుంచి దేవుడి రక్షణను అన్వేషిస్తున్నా అందులో ప్రవేశించటానికి తమ్ము తామే కష్టపెట్టుకున్నారు.

ఏ ప్రమాణాన్ని అనుసరించి సత్యం దోషంనుంచి భేదింపబడుతుందో అది వాస్తవంగా పునరుత్థానడినం వరకు కన్పించదని చెప్పండి. మీరు సత్యాన్ని ప్రేమించేవారిలోనివారు అయితే దీనిని తెలుసుకొంటారు. అంతే కాదు బయాన్‌లో వెల్లడింపబడ్డ వివరణద్వారా పునరుత్థానదినం సంక్రమించే సమయానికి ముందే మీరు దానిప్రక్కగా ఉంటున్న ఇతరమైన దానినుంచి సత్యాన్ని విభజించ కలుగుతారు.

ఎవరిని దేవుడు ప్రదర్శిస్తాడో ఆతని దగ్గరనుంచి ముసుగువలె తమను మూసివేసుకోవటం, గ్రంథంలో దివ్యుడిగా నిరూపింపబడ్డట్లు వారి సృష్టికి వస్తువు అయిన ఆతని ఎదుట అర్చనతో వినమ్రులు కావటాన్ని తిరస్కరించటం చేసినందువల్ల దేవుడి విధినిర్ణయంచేత అసత్యవర్తనులని పరిగణింపబడుతున్న సమయంలో ఆ పునరుత్థానదినంనాడు తమను తామే సత్యవర్తనులమని భావించుకొనేవారి సంఖ్య ఎంతో విస్తారము.

[XVII, 4].

35. తమను తాము దివ్యోపదేశ ధార్మికతత్వ సంబంధమైన దుస్తులు లేకుండా చేసుకొన్నవారు కావటంవల్ల అగ్నిని ముసుగుగా ధరించే సమయంలో తమ జీవితాల వన్నింటినీ సిఖ్యా

దుస్తులతో కప్పివేసికొన్నవారి సంఖ్య ఎంత ఉన్నది! ప్రత్తి తోటి, ముతకనూళ్ళతోటి తయారుచేయబడ్డ వస్త్రాలను ధరించి నప్పటికీ దివ్యోపదేశ ధార్మికత్వాలకు సంబంధించిన ఆ దుస్తులను కలిగిఉండటంవల్ల స్వర్గసంబంధమైన దుస్తులతో అలంకరించుకొని దేవుడు ఉత్తమసాఖ్యంలో ఉత్సాహం పొందేవారి సంఖ్య ఎంత ఉన్నది! ఈ ఇరువురినీ కలపటం కోసం, దివ్యోపదేశ ధార్మికత్వాలకు సంబంధించిన దుస్తులతో మిమ్మల్ని అలంకరించుకొని, అలా చేయటానికి శక్తివంతులైనట్లైతే ఉత్తమమైన సిల్కు వస్త్రాలను ధరించి నిశ్చయంగా మీరు దేవుడి దృష్టిముందు ఉండటం ఎంతో మంచిపని. లేకపోతే మీరు చివరకు ధర్మరాహిత్యంతో నైనా ప్రవర్తించండి; కానీ దైవనిష్ఠాపరత్వాన్ని, నీతిని పాటించండి....

అయితే అతని అస్తిత్వం ఈ ప్రజలలో ఉండటమనే ఏకైక కారణం వల్ల మేము ఏదైనా ఒక న్యాయసూత్రాన్ని సూచించడం కాని, ఏదైనా ఒక నిషేధాన్ని ప్రవేశపెట్టటం కాని చేయలేదు. మేము అతని నామమహిమకు అతడి హేతు ఘనతకు మాత్రమే మా అనతితో కొన్ని న్యాయసూత్రాలను వెల్లడిజేసాము; అతని ప్రత్యక్షీకరణ ఘడియల్లో మీరు అతని ద్వారా దేవుని ఉత్తమసాఖ్యాన్ని పొందవచ్చునని ఆయనకు అసహ్యకరమైన వస్తువులకు దూరులై చరించవలెనని మేము వేటికి ప్రతికూలురమో ఆ చర్యలను అట్టి సమయాలల్లో నిషేధించాము.

దేవుడు ఎవరిని ప్రత్యక్షీకరిస్తాడో అతని అసాఖ్యం, దేవుని అసాఖ్యమే ననీ, దేవుడు ఎవరిని ప్రత్యక్షీకరిస్తాడో అతని ఉత్తమ సాఖ్యం దేవుని ఉత్తమసాఖ్యమని రూఢిగా ప్రకటిం

చండి. మీరు అతని అసాఖ్యాన్ని విడిచిపెట్టండి; శరణం చేరటంకోసం ఆతడి ఉత్తమ సాఖ్యందగ్గరకు పరుగెత్తండి. అతని ఉత్తమ సాఖ్యానికి, ఆతడిని నిశ్చయంగా నమ్మినవారు, తమ విశ్వాసంఎడ ఉత్తమ నిశ్చయం కలవారివంటివారు సజీవ మార్గదర్శకులని వెల్లడించండి; అతడి అసాఖ్యానికి సజీవ సాక్షులు అయినవారు ఆతడి దగ్గరనుంచి పంపబడ్డ దేవుని పద్యాలను విన్నప్పుడు లేదా ఆతనిచేత వెల్లడిచేయబడ్డ దివ్య పద్యాలను చదివినప్పుడు దైవవిశ్వాసాన్ని పొంది వెంటనే దైవవిశ్వాసాన్ని ఆలింగనం చేసుకోవటం, నిశ్చయాన్ని పొందటం చేయనివారు. XVI. 14.

## వివిధ వ్రాతల నుండి స్వీకరించిన భాగాలు

36. దేవుడు ప్రభువు. అందరూ ఆయన భక్తులు, ఆయనను పూజించేవారు అని చెప్పండి. దేవుడు సత్యవంతుడు: అందరూ ఆయనఎడ విధేయతను చెల్లిస్తారు. ఇది దేవుడు, మీ ప్రభువు: ఈయన దగ్గరకే మీరు తిరోగమిస్తారు. దేవుడికి సంబంధించిన అనుమానం ఏదైనా ఉన్నదా? ఆయన మిమ్మల్ని ఇంకా ఇతర వస్తువులను సృజించాడు. సర్వ ప్రపంచాల ప్రభువు ఆయనే.

37. దేవుడు ఎవరిని ప్రత్యక్షంచేస్తాడో అతని మహత్వం ఇతరమైన ప్రతిమహత్వంకంటే గణనాతీతమైనది; అతడి ప్రభావం ఇతరమైన ప్రతి ప్రభావంకంటే ఘనమైనది. అతని సౌందర్యం ఇతరమైన ప్రతిసౌందర్యరూపాన్ని అతిశయిస్తుంది; అతని శోభ ఇతరమైన ప్రతిశోభాస్వరూపాన్ని అత్యధికంగా అతిశయిస్తుంది. అతని జ్యోతిఃకాంతిముందు ప్రతిజ్యోతి

కాంతి పాలిపోతుంది; అతని కారుణ్య చిహ్నాలముందు ఇతర మైన ప్రతికారుణ్య సంకేతాలూ పతనమౌతవి. సంసిద్ధమైన అతని పరిపూర్ణత ఎదుట ఇతరమైన ప్రతిపరిపూర్ణత అభావం వలె అయిపోతుంది; అతని స్వతంత్ర శక్తిముందు ఇతరమైన ప్రతిశక్తిప్రదర్శన అభావంవలె అయిపోతుంది. అతనిపేర్లు ఇతరమైన అన్ని పేర్లకంటె అత్యుత్తమమైనవి. అతని ఉన్నత సాఖ్యం ఏ ఇతరమైన ఉన్నత సాఖ్యప్రకటనల మీదనైనా అగ్రేసరత్వాన్ని వహిస్తుంది. ఇతరమైన ప్రతిమహత్వ చిహ్నానికి అతని సర్వశ్రేష్టమహత్వం చేరుకోవటంకోసం ఎంతో దూరాన ఉంటుంది; అతని ప్రత్యక్షతావైభవం ఏ ఇతరమైన ప్రత్యక్షతా వైభవాన్నైనా ఎంతో మించి విస్తరిస్తుంది. అతని దివ్యమైన ఉపగోపనం ఏ ఇతరమైన దాచుకోవటం కన్నా అతి గంభీర మైనది. అతని ఔన్నత్యం ఇతరమైన ఏ ఔన్నత్యం కన్నా అయినా అగణితోన్నతిని వహిస్తుంది. అతని మహనీయ కరుణ ఇతరమైన ఏ కరుణాసాక్ష్యానికైనా అసమానమైనది. అతని శక్తి ప్రతిశక్తిని అధిగమిస్తుంది. అతని సార్వభౌమత్వం ఇతరమైన ప్రతి సార్వభౌమత్వం ముందూ అజేయమైనది. అతని దివ్యరాజ్యం ఇతరమైన ప్రతిరాజ్యంకంటే ఎంతో ఉన్నతస్థితిలో కల్పితమైనది. అతని జ్ఞానం సృష్టింపబడ్డ సమస్త వస్తువులు పరిపూర్ణంగా నిండినదై ఉంటుంది; సంసిద్ధ మైన అతని అధికారం సర్వప్రాణులమీద వ్యాప్తిని పొంది ఉంటుంది.

**38.** అందరు మానవులు దేవుడి దగ్గరనుంచి బయలు దేరుతారు; అందరూ ఆయనదగ్గరకు తిరోగమిస్తారు. అందరూ నిర్ణయంకోసం ఆయనముందు కనిపిస్తారు. ఆయన పునరు

త్థాన దినానికీ, పునర్జననదినానికీ, పరిగణనదినానికీ, ఆయన ప్రభువు: ఆయన వెల్లడించినమాట "తులారూపము".

ఒక వ్యక్తి, ఆయనను తప్ప, ఇతరుడిని వెతకకుండా ఆయన ఆవిష్కరణవేళ వివేకంతో తనకు తానే మరణించి నప్పుడు సత్యమైన మృత్యువు అనుభవానికి వస్తుంది.

సమాధులనుంచి సత్యమైన పునరుత్థానం పొందటమంటే ఆయన ప్రవచనశక్తి ద్వారా ఆయన ఇచ్ఛకు అనుగుణంగా త్వరపెట్టబడటమే అని అర్థము.

స్వర్గం ఆయన ఉత్తమసౌఖ్య సంపాదనము: నిరంతర నరకాగ్ని న్యాయాన్ని అనుసరించి చేసిన ఆయన నిర్ణయము. ఆయన తనను ఆవిష్కరించుకొనే దినం ఆయన నిర్ణయించి నంతకాలం నిలిచిఉండే పునరుత్థానము.

సర్వమూ ఆయనకు చెందినది; సర్వమూ ఆయన రూపొందించినది. ఆయన ప్రక్కన ఉండేది అంతా ఆయన సృజించిన ప్రాణులు.

మహోదాత్తుడు, మహోన్నతుడు అయిన దేవుని నామంతో

39. నిశ్చయంగా నేనే దేవుడను: నేను తప్ప మరొక దేవుడు లేడు; నేను తప్ప సర్వమూ నా సృష్టి. "ఓ మీరా! నా ప్రాణులారా! నన్ను ప్రార్థించండి" అని ప్రవచించు.

నేను నిన్ను అస్తిత్వంలోనికి పిల్చాను; నిన్ను పోషించాను; నిన్ను రక్షించాను, నిన్ను ప్రేమించాను; నిన్ను ఉన్నతుడిని చేశాను. నా పద్యాలను నాచేత ఉద్దేశింపబడ్డట్టుగా నీవు చదవవచ్చుననీ, మహత్తరమూ, మహోన్నతమూ అయిన మార్గానికి భిన్నమైనది ఏదీకాని నా మతంలోకి ఎవరిని సృష్టిం

చానో వారిని రమ్మని అజ్ఞాపించటానికీ. నేను నిన్ను నా స్వీయాత్మరూపంగా ఉండటానికి నిన్ను ఔదార్యంతో ఎన్నుకొన్నాను. నేను సృష్టించిన సర్వవస్తువులను నీకోసం రూపొందించాను; నా ఇచ్ఛాసౌశీల్యంతో నేను నిన్ను సమస్త మానవ జాతిఎడ సార్వభౌమపాలకుణ్ణి చేశాను. అంతేకాక ఎవరు నా మతాన్ని స్వీకరిస్తారో వారు నా ఐక్యతను విశ్వసిస్తారని నిర్ణయించాను; నేను ఈ నమ్మకాన్ని నీ జ్ఞాపకంతో జోడించాను. నీ తరువాత నీవు కలిగిఉన్నటువంటివారిది, నా మతాన్నిగురించి బయాన్‌లో ఏదైతే చెప్పబడ్డదో దానిది అయిన జ్ఞాపకము నా అనుజ్ఞతో "సజీవోత్తరాలు" అయిఉండటాన్ని కలుగజేసింది. వాస్తవంగా ఏది నా సేవకులలోని నిష్కపటులతో దివ్యస్వర్గంలోపల ప్రవేశించటానికి సామర్థ్య మిస్తుందో అది ఇదే.

సూర్యుడు నిశ్చయంగా నా సేవకులలోని సత్యవిశ్వాసపరులు అతడు ఉద్భవించటంతో ప్రతి దైవవిధి ప్రారంభాన్ని గమనించుకోవటానికి నా సన్నిధినుంచి ఒక చిహ్నం తప్ప అన్యం కాదు. సత్యానికి నేను నిన్ను నీద్వారానే సృష్టించాను; తరువాత నా ఉత్తరువుతోనే నీ ప్రవచన సృజనాశక్తుల ద్వారా సమస్త వస్తువులను రూపొందించాను మనము సర్వశక్తి సంపన్నులము. నిన్ను ఆరంభంగా అంతంగా ఉండటానికీ, దర్శింపబడటానికీ, గోప్యం చేయబడటానికీ నియోగించాను. రూఢిగా మనం సర్వజ్ఞేయులము.

నీకు భిన్నులైనవారిలో ఏ ఒక్కరూ మతప్రవక్తలలో ఒకడుగా ఉద్భవింపబడటం పూర్వం జరగలేదు; ఇకముందు జరుగదు; ఇంతేకాక నీకు తప్ప ఏ ఒక్క ఇతరుడికి ఏదైనా

పవిత్రగ్రంథాన్ని తెలియజేయటం పూర్వం జరుగలేదు; ఇక ముందు జరుగదు. సర్వపరివేష్టనుడు, ఉత్తమప్రియుడు అయిన ఆయనచేత నియమింపబడ్డ నిర్ణయం ఇటువంటిది.

సృష్టింపబడ్డ వస్తువు లన్నిటికీ, సత్యానికి, బయాన్ మన పరిష్కారరూప నిదర్శనము. దాని పద్య-బహిరంగకరణం ముందు ప్రపంచంలోని సర్వ ప్రజానీకాలు శక్తిహీనులు. ఈనాడు నీవు మన నిదర్శనాలన్నిటికి ఉంచదగ్గ స్థలానివి. అయినప్పటికీ అది పూర్వానికిగానీ భవిష్యత్తుకుగానీ సమస్త శ్రుతిగ్రంథాల మొత్తం వెరసిని అది శ్రద్ధతో కాపాడుతుంది. అతి పవిత్రము, అత్యుదాత్తము అయిన మన స్వర్గసీమవనాలల్లో ఎవరు ప్రవేశపెట్టడాన్ని మనం అభిలషిస్తామో మనం వారిని సంభవింపజేస్తాము. మన ఆజ్ఞానుసారంగా ప్రతి దైవ విలాసంలోను దివ్యావిష్కరణ ఇలా స్థాపింపబడుతుంది. మనం సర్వోన్నతపాలకులము. రానున్నదినాలల్లో అది పునర్నవ్యతను పొందకపోతే మనం రూఢిగా ఏ మతాన్నీ ఎన్నడూ స్థాపించము. ఇది మనం గంభీరంగా చేసిన ప్రతిజ్ఞ. మనం సర్వవస్తువులమీద సర్వశ్రేష్టులము.

ఆయన దేవుడు, సార్వభౌమ ప్రభువు, సమస్త మహిమాన్వితుడు.

40. ఇలా ప్రవచించండి; ఎవరిని తాను గౌరవించడానికి కోరతాడో అతణ్ణి మహోదాత్తతతో శక్తివంతుణ్ణి చేసే దేవుడు ప్రశంసితుడు అవుగాక! అక్కడ నిశ్చయంగా ఆతడు తప్ప దేవుడు లేడు; ఆతనివి అతిశ్రేష్టమైన బిరుదములు; తాను ఇష్టపడ్డట్లుగా పరిపూర్తి చేయబడటానికి తన ప్రవచనాలను కల్పించుకొనేదీ ఆతడే; వెలుగును పొంది ధార్మికత్వమార్గాన్ని అన్వేషిస్తున్నవారిని నడిపేది ఆతడే.

నీ ప్రభువు అయిన దేవుడికి భయపడకు: ఆతని నామాన్ని పగలు, సాయంకాలము ప్రవచించు. విశ్వాసరహితుల ప్రే ణలను అనుసరించకు; అలాచేస్తే నీవు వ్యర్థ భావాలన సూచించేవారిలో లెఖ్కింపబడటం జరుగుతుంది. "ఎవర తానే ప్రభువు" అన్న ప్రాథమికాంశాన్ని విశ్వాసంతో అను రించు; ధార్మికుడవు కమ్ము. ఏదీ నీకు వ్రణబాధను కలి గించకుండుగాక లేదా ఈ హేతువులో కలగటానికి విధింపబడ్డ వస్తువులేవీ నిన్ను కలవరపెట్టకుండుగాక! మనఃపూర్వకంగా దేవుడికోసం శ్రమపడు; ధర్మమార్గాన చరించు "ఈ ప్రపంచం లోని, తరువాత ప్రపంచంలోని రాజ్యాలల్లో వసించే దేవుడు నాకు తగినవాడు" అని పల్కుతూ అవిశ్వాసులను ఎదు ర్కొనేటప్పుడు నీ ప్రభువైన దేవుడిమీద నీ సమస్త విశ్వాసాన్ని నిలిపిఉంచు.

దేవుడు విశ్వాసపరులను కూడవెచ్చేరోజా సమీపిస్తున్నది. సత్యానికి ఆతనికంటే దేవుడు లేడు; దివ్యమార్గదర్శన శక్తి ద్వారా ఎవరు సక్రమంగా నడపబడ్డారో వారితో ఉండి దైవ శాంతి వారికడ వర్ధిల్లుగాక!

ఆతడు దేవుడు; పరమపాలకుడు; సార్వాధికారసత్యము;
ఎవరిసహాయాన్ని అందరూ అభ్యర్థిస్తారో ఆతడు.

**41.** స్వర్గాలరాజ్యం, భూ రా జ్యం ఎవరికి చెందినదో సృష్టింపబడ్డ సమస్త వస్తు రాజ్యం ఎవరి హస్తగతమై ఉంటుందో, సర్వం ఎవరిదగ్గరకు తిరోగమిస్తుందో ఆయన సుప్రశస్తుడు. ప్రతి వ్యక్తిపరిమాణాన్ని, ప్రతి వస్తుపరిమా ణాన్ని ఎవరు నిర్ణయిస్తారో ఎవరి హేతువుకోసం కృతజ్ఞతను

సమర్పించేవారి ప్రయోజనం కోసం ఎవరు తన పవిత్ర గ్రంథంలో తన ఇంపైన బహుమానాలను, దీవెనలను తెలియజేస్తారో ఆయన ఆతడే.

ఈ భౌమ జీవితం అంతమొందుతుందని ప్రతిఒక్కరూ ఊపిరివిడిచి ఓర్పుతో సహించేవారి చర్యలను కోరుకున్న కానుకలతో పారితోషిక మిచ్చే ప్రభువైన నా దేవుడిదగ్గరకు తిరోగమిస్తారని చెప్పు. నిశ్చయంగా నీ ప్రభువు ఆతడు కోరినట్లే ఆతడి ఆనతికి గల నీతితో సృష్టింపబడే సమస్తవస్తువుల పరిమాణాలను నిర్ణయిస్తాడు; నీ ప్రభువు ఉన్నతానందానికి తగ్గట్లుగా ఎవరు నడుచుకుంటారో వారు రూఢిగా పరమానందాన్ని పొందేవారిలోనివారు.

నీ ప్రభువు గడచినకాలంలో ప్రజలను అతని ప్రభువు దగ్గరకు రమ్మని ఆజ్ఞాపించటంలో అపజయం పొందిన మత ప్రవక్తను ఎవ్వడినీ ఉన్నతస్థానానికి చేర్చలేదు; ఈనాడు సత్యంగా ప్రాచీనసమయాలకు సమానమైనది; దేవుడు వెల్లడించిన పద్యాలను గురించి నీవు యోచించవలె.

దేవుడు ఆయన ప్రవక్త అయిన మహమ్మదును పంపినపుడు ఆ సమయంలో మతప్రవక్తల అవృతి దైవవిజ్ఞానంతో నిర్ణీతం కావడం జరిగింది. సరే ఆ ప్రతిజ్ఞ నిశ్చయంగా సత్యరూపాన్ని పొందింది; దేవుడి నిర్ణయం ఆయన ఆజ్ఞాపించినట్లు నెరవేర్చబడ్డది. రూఢిగా మనం ఈనాడు దేవుడి దినాలల్లో నివసిస్తున్నాము. ఇవి ఎటువంటి పోలినటువంటివాటిమీద పూర్వం సూర్యుడు ఉదయించలేదో అటువంటి మహనీయతగల దినాలు. ఇవి గడచిన కాలాలవారు వేగంగా ఎదురుచూచిన దినాలు. మీకు ఏమి సంభవించటంవల్ల త్వరగా మేలుకు

న్నారు? ఇవి సత్యపు వేగుచుక్క ప్రకాశవంతంగా శోభిల్లటం కోసం దేవుడు రూపొందించినవి. ఏవి మీరు నిశ్శబ్దత వహించటాన్ని కల్పించినవి? ఇవి ప్రాచీన సమయంలో వేటికోసం వేదనతో నిరీక్షిస్తుండేవారో అవే నిర్ణయింపబడ్డ దినాలు — దివ్యనాయాగమన దినాలు. ఓ విశ్వాసదిన సమాజకులారా! మీరు దేవుడికి కృతజ్ఞత లర్పించండి.

సత్యాన్ని త్రోసిపుచ్చేవారి చర్యలు మిమ్మల్ని తెరలోపలె బయటికి మూసివేయకుండుగాక. అటువంటి ప్రజలు మీ శరీరాలమీద మాత్రమే అధికారపత్రాన్ని కలిగిఉన్నారు. దేవుడు మీ ఉద్వేగాలమీద, ఆత్మలమీద, హృదయాలమీద, అధికారాన్ని వారిలో ఉంచలేరు. మీరు దేవుడికి భయపడితే అది అదృష్టవశాన నీకు మేలును కలిగిస్తుంది. సర్వవస్తువులు మీకోసమే సృజింపబడ్డవి; మీ సృష్టి ఇతరమైన శూన్యతకోసం ఆజ్ఞాపింపబడలేదు. మీరు దేవుడంటే భయపడండి; లక్ష్యపెట్టండి; లేకపోతే రూపాలు, దుస్తులు ఆయనను గుర్తించటం నుంచి మిమ్మల్ని అడ్డుపెడతవి. అవకాశాన్నిబట్టి దేవుడు మీతో కరుణాన్వితంగా వ్యవహరించడంకోసం ఆయనకు కృతజ్ఞతలను సమర్పించండి.

ఈ భౌతికజీవితం నశించటం నిశ్చయము; దాని సౌఖ్యాలు మాసితీరుతవి. హాజరుగా మీ అల్పనిద్రనుంచి మేల్కొనుటం కోసం పశ్చాత్తాపవ్యథలతో దుఃఖించి మీరు చాలాకాలం ముందే దేవుడిదగ్గరకు తిరోగమిస్తారు; వేగంగా మిమ్మల్ని మీరు దేవుడిముందు చూచుకొంటారు; మీ చేష్టలను గురించి అడగబడతారు.

పూర్వం తెలియజేసిన దేవగ్రంథాలను మీరు ఇంకా చదువుతూ, న్యాయస్వర్గంనుంచి క్రిందకు పంపబడ్డ పద్యాలను ఘోరంగా తిరస్కరించటానికి ఎలా సాహసిస్తారు ?

ముందుగానే మీతో ఏర్పాటు చేయబడ్డ మీ ప్రభువుతోటి సమావేశాన్ని ఎలా మీరు విడిచిపెడతారు ? ఎలా ఈనాడు అతని హెచ్చరికను లక్ష్యపెట్టటంలో అపజయం పొందుతారు? నిశ్చయంగా మీ ప్రభువు విజ్ఞానసంపన్నులను చేసినవారు సత్యమైన దైవవిశ్వాసంతో అభిన్నతను దానంచేసినందుకు ఆతనికి ఈ దినాన కృతజ్ఞతలను అర్పించినవారు తప్ప మీలో మిగిలినవారు రూపాలకు అంటుకొనిపోతూ, స్వార్థ కాంక్షల ప్రేరణాలను అనుసరిస్తూ మీ ప్రభువర్యుని ఉత్తమ సాఖ్యాన్ని త్రోసిపుచ్చుకొన్నారు. అందువల్ల మీరు అదృష్టవశాన వారు గ్రహించటంకోసం హటాత్తుగా నీతిని ప్రకటిస్తూ, ఏకైక సత్యదేవుడి మార్గాలను బోధించేవారికి వర్తమానాన్ని ప్రకటించండి.

నిన్ను దుఃఖపెట్టేదాన్ని ఉచ్చరించకుండా నీ నాలుకను ఆపివేయి. కారుణ్యంకోసం దేవుడిని వేడుకో. ఆయనా సత్యంగా విశ్వసించేటటువంటి ఆయన–సేవకులతో ఉండటం వల్ల ఆయన నిశ్చయంగా ధార్మికవర్తనులను గుర్తించాడు; స్వర్గాలల్లోగాని, భూమిమీదగాని, ఏదైనా సరే ఆయన ఎరుకను తప్పించుకోలేదు గనుక ఆయన అనర్థాచరణుల చేష్టలను ఎరుగనివాడు కాడు.

నిర్మలములు, పరిపూర్ణములు అయిన ఈ పద్యాలు నీ ప్రభువు దయకు నిదర్శనాలు: సమస్త మానవజాతికి మార్గదర్శకమూలాలు; ఇవి వాటిని నమ్మేవారికి జ్యోతిస్సు; వాటికి

దూరంగా వెనుదిరిగి వాటిని తిరస్కరించేవారిని వ్యథపెట్టే వేదనాగ్ని.

42. దేవుడు సర్వసమర్థుడు, అత్యుత్తమప్రియుడు అయిన అయన తప్ప ఇతరమైన దేవుడు లేడని దృష్టాంతీకరిస్తున్నాడు.

దేవుడు పునరుత్థానదినంనాడు ఎవరిని ప్రత్యక్షీకరిస్తాడో ఆతడిమీద మీ దృష్టిని సుస్థిరంచెయ్యండి; తరువాత ఆతడు దేనిని క్రిందకు పంపిస్తాడో దానిని దృఢంగా విశ్వసించండి.

ప్రతి విజయవంతుడిమీద దేవుడు నిర్వివాద విజయాన్ని పొంది ఉన్నాడని ప్రవచించండి. స్వర్గంలో గాని, భూమిమీద గాని, వీటిమధ్యనున్న ఎందులో గాని అయన విజయోపేత సర్వాతిశయ సార్వభౌమత్వాన్ని విచ్ఛిన్నం చేయగలవాడు ఒక్కడూ లేడు. అయన దేనిని కోరుతాడో దానిని అయన అజ్ఞాశక్తిద్వారా ఉనికిని పొందటానికి పిలుస్తాడు. నిశ్చయంగా దేవుడు బలవంతుడైన భారవహుడు, సహాయకుడు, సంరక్షకుడు.

## ప్రార్థనలు; ధ్యానములు

43. ఓ నా దేవా! నిశ్చయంగా నేను నీ సేవకుడను, నీ దరిద్రుడను, నీ అభ్యర్థించువాడను, నీ నికృష్టప్రాణిని, నీ ఆశ్రయాన్ని అర్థిస్తూ నీ ద్వారం దగ్గరకు చేరాను. సృష్టింపబడ్డ సమస్త వస్తువులు నీ ఉదాత్తస్థితినుంచి అభ్యంతర పెట్టబడ్డాయని, సర్వసృష్టికి నీ అంతరికమైన అస్తిత్వందగ్గరకు చొరవ తిరస్కరింపబడ్డదని నేను తెలుసుకొన్నప్పటికీ నీ ప్రేమలో తప్ప తృప్తిని, నీ జ్ఞాపకంలో తప్ప జయాన్ని, నీఎడ వినయంలో తప్ప వేగపాటును, నీ సాన్నిధ్యంలో తప్ప సంతో

షాన్ని, నీతో ఐక్యతను పొందటంలో తప్ప ప్రశాంతిని నేను దర్శించలేదు. నిన్ను చేరటానికి నేను ఎప్పుడు ప్రయత్నించినా నాలో నీ ఔదార్యచిహ్నాలను తప్ప ఇతరమైన వాటిని దర్శింపను; నా ఉనికిలో నీ ప్రియమైన దయావిష్కరణాలను తప్ప ఇతరమైన వానిని తిలకింపను. సృజించబడ్డ వస్తువు ఏదీ నిన్ను చేర్పబడదు, నిన్ను గ్రహింపదు, కనుక నీ ప్రాణి తప్ప ఇతరు డెవ్వడు ఎలా నీతో పునరైక్యతను అన్వేషిస్తాడు; నీ అస్తిత్వాన్ని అందుకొంటాడు? ఒక అల్పుడైన సేవకుడు, అతడికోసం నీవు నీ రాజ్యావిష్కరణాలను, నీ సార్వభౌమత్వాన్ని వెల్లడించే అద్భుత ప్రమాణాలను నియమించిన నిన్ను గుర్తించటానికి గాని నీ ప్రశస్తిని మెచ్చటానికిగాని అవకాశం ఎలా కలుగుతుంది? ఈవిధంగా ప్రతి సృష్టింపబడ్డ వస్తువు అది దాని ఆంతరిక వాస్తవికతమీద ఉంచబడ్డ పరిమితులవల్ల నీ ఉనికి పుణ్యస్థానంనుంచి అభ్యంతరపెట్టబడినట్లు సాక్ష్యం వహిస్తున్నవి. నీ విధి పుణ్యస్థలాన్ని యోగ్యంచేసే అది సమస్త సృష్టిసంపాదనను మించిన దైనప్పటికీ ఏమైనా నీ ఆకర్షణప్రభావం నీ సృష్టి వాస్తవికత్వాలలో నిరంతరం సహజమై ఉండటం నిర్వివాదము. ఓ నా దేవా! ఇది నిన్ను ప్రశంసించడానికి నా అధికారరాహిత్యాన్ని వ్యక్తంచేస్తున్నది; నీకు కృతజ్ఞతను సమర్పించడంలో నా అతిశయమైన అసామర్థ్యాన్ని వెల్లడిచేస్తున్నది; ఇంకా నీ దివ్యైక్యతాంగీకారాన్ని ఎంత అధికంగా పొందవలెనో లేదా స్వచ్ఛమైన నీ ప్రశస్తి చిహ్నాలను, నీ పావనత్వాన్ని, నీ మహత్వాన్ని చేరటంలో ఎంత అధికంగా విజయాన్ని పొందవలెనో! ఇంతేకాక నీ శక్తితో నీ స్వీయాత్మకోసం తప్ప ఏ ఇతరంకోసం పరితపించను: నిన్ను తప్ప ఏ ఇతరుడినీ అన్వేషింపను.

44. ఓ దేవా! నీ నామము ప్రస్తుతింపబడుగాక. నీ సత్యానికి మా ప్రభువువు: ఏది స్వర్గాలలోను భూమిమీ ఉన్నా నీవు దానిని ఎరుగుదువు. అప్పుడు మా మీదికి నీ ఒ దయాచిహ్నాన్ని పంపించు. రూఢిగా నీవు దయను ప్రదర్శిం వారిలో అధిగమింపబడేవాడివి కావు. ఓ ప్రభూ! సమ ప్రశస్తి నిన్ను చెందుగాక. నీ సేవకులలో నిష్కపటులైనవా హృదయాలను ఏది సౌఖ్యపెడుతుందో ఆ నీ ప్రత్యక్షంనుం మాకోసం నిర్ణయాలను కల్పించు. ఓ దేవా! నీవు మహి మాన్వితుడవు; నీ స్వర్గాలకు, భూమికి, వీటిమధ్య ఏ ఉంటుందో దానికి నీవు శ్రేష్టుడవు. నీవు సార్వభౌమ ప్రభువువు, అత్యంత పవిత్రుడవు, సమస్త శక్తివంతుడవు సర్వవివేకివి. ఓ నా దేవా! నీ పేరు ప్రస్తుతింపబడుగాక. ఎవరు దేవుడిని ఆయన చిహ్నాలను విశ్వసిస్తారో వారిమీదికి వారు మానవజాతి, సామాన్యులమీద ప్రబలులు కావటానికి సమర్థులను చేసేటందుకు నీ ప్రత్యక్షంనుంచి శక్తివంతమైన ఉపకారాన్ని పంపించు.

45. ఓ ప్రభూ! నీకు ప్రశస్తి కలుగుగాక. మా పాపాలకు మమ్ము క్షమించు; మా ఎడ దయవహించు. మమ్మల్ని నీ దగ్గరకు తిరోగమించటానికి సమర్థులను గావించు. నీమీద తప్ప ఆధారపడకుండా ఉండటానికి మమ్మల్ని బాధపెట్టకు: నీ ఔదార్యం ద్వారా దేనిని నీవు ప్రేమిస్తావో, దేనిని అపేక్షిస్తావో ఏది నీకు తగిఉందో దానిని మాకు ప్రసాదించు. సత్యోపేతంగా విశ్వసించినవారి స్థానాన్ని ఉత్తమమం చెయ్యి: వారిని ని మహోదాత్త క్షమాగుణంతో క్షమించు. నిశ్చయంగా నీవు ఆపదలో సహాయకారివి, స్వీయజీవనుడవు.

46. మా ప్రభువువైన ఓ దేవా! నీ ఔదార్యంతో ఏది నీకు అసహ్యాకరమైనదో దాని దగ్గరనుంచి మమ్మి రక్షించు; ఏది నీ యోగ్యతను వెల్లడిచేసేదో దానిని మాకు ప్రసాదించు. నీ ఔదార్యంనుంచి మాకు ఎక్కువగా ప్రసాదించి మమ్మల్ని దీవించు. మేము చేసిన చెడుపనులకు మమ్మల్ని మన్నించు; మా పాపాలను దూరంగా కడిగివెయ్యి; నీ మహోదాత్త క్షమా గుణంతో మమ్మల్ని క్షమించు. రూఢిగా నీవు అత్యుత్తమోన్న తుడవు, స్వీయజీవనుడవు.

నీ ప్రేమామృత దూరదృష్టి స్వర్గాలల్లో, భూమిమీద, సృజింపబడ్డ వాటి అంతటిమీద పరివేష్టించింది; నీ క్షమాగుణం సమస్తదృష్టినీ అధిగమించింది. సార్వభౌమత్వం నీది; సృష్టికి అవిష్కరణకు సంబంధించిన రాజ్యాలు నీ చేతిలో ఉన్నవి; నీవు సృజింపబడ్డ సమస్తవస్తువులను నీ దక్షిణహస్తంలో వహిస్తున్నావు; నియమించబడ్డ క్షమాగుణ పరిమాణాలు నీ పట్టులో ఉన్నాయి. నీ సేవకుల్లో ఎవరిని నీవు సంతోషపెడతావో వారిని క్షమిస్తావు. నిశ్చయంగా నీవు నిరంతర క్షమాలక్షణుడవు; సర్వప్రియుడవు. నీ జ్ఞానాన్ని తప్పించుకొనేది గాని, నీ దగ్గరనుంచి దాచిపెట్టబడ్డది గాని ఏదీ లేదు.

మా ప్రభువువైన ఓ దేవా! నీ బలశక్తిద్వారా మమ్మల్ని రక్షించు; నీ అద్భుతకరంగా తరంగితమయ్యే మహాసాగరంలో ప్రవేశించటానికి మమ్మల్ని సమర్థులను గావించు; ఏది నీకు యోగ్యమైనదో దానిని మాకు ప్రసాదించు.

నీవు సార్వభౌమ పాలకుడవు, బలయుత కర్మకారుడవు, మహాన్వితుడవు, సర్వప్రియుడవు.

47. ఓ నా దేవుడవైన ప్రభూ! నీకు ప్రఖ్యాతి కలుగుగాక ఏదైనా సరే నీవు తెలుసుకోవటాన్ని తప్పించుకోలేదు; పట్టులోనుంచి జారిపోగలదు గాని, గడచిన లేదా రానున్న స్వర్గాలల్లోగాని లేదా భూములమీద గాని నీ ప్రయోజనాన్ని విఘాతంచేయగలది గాని ఏదీ లేదు.

నీవు స్వర్గాన్ని, అందులోని నివాసులను వీక్షిస్తావు: దా... క్రింది దేశాన్ని, అందులో నివాసంచేసేవారిని చూస్తావు అందరూ నీ సేవకులు తప్ప ఇతరులుకారు: అందరూ నీ పట్టులో నిలువబడ్డవారు.

ఓ ప్రభూ! నీ మార్గంలో వారు ప్రాణార్పణకు సిద్ధపడ్డవారు కావటంవల్ల నీ దినాలల్లో తాలిమిగల నీ సేవకులకు యోగ్యమైన విజయాన్ని ప్రసాదించి, విజయవంతులను గావించు వారి మనస్సులకు సౌఖ్యాన్ని తెచ్చియిచ్చేదాన్ని, వారి ఆంత రిక స్థానాలను సంతోషపెట్టేదాన్ని, వారి హృదయాలకు స్థిర త్వాన్ని, వారిశరీరాలకు శాంతాన్ని కలిగించేదాన్ని, వారి ఆత్మలను అత్యధికోన్నతుడైన దేవుని పుణ్యస్థానాన్ని చేరటానికి పరమోత్కృష్టస్వర్గాన్ని, సత్యవిజ్ఞానులు, నీతియుతులైన వారికి నీవు విధించే ఏకాంతస్థలాలను పొందటానికి అధిరోహింపచేసేదానినీ నీవు వారిమీదికి పంపించు. మేము మీ సేవకులము, నీ దాసులము, నీ బానిసలము, నీ దరిద్రులము అయిఉండటంవల్ల నిశ్చయంగా నీవు అంతా ఎరుగుదువు మా ప్రభువైన ఓ దేవా! నీవుతప్ప మరొక ప్రభువును మేము ప్రార్థించము: ఈ ప్రపంచానికి, తరువాతి ప్రపంచానికి దయా దేవుడవైన ఓ దేవా; నీవల్ల తప్ప మేము మరొకరివల్ల దీవెనలను లేదా ఔదార్యాన్ని అర్థించము. నీ సమస్తమైన అస్తిత్వం

సంపదను, స్వాతంత్ర్యాన్ని, కీర్తిని, ప్రభావాన్ని, మేరలేని ఔదార్యాన్ని ప్రదర్శిస్తుంటే మేము దారిద్ర్యరూపులము, శూన్యరూపులము, అసహాయతా రూపులము, అధోగతిరూపులము. ఓ ప్రభూ! మా ప్రతిఫలాన్ని ఈ ప్రపంచపు మంచికి, తరువాతి ప్రపంచపు మంచికి, పైనుంచి క్రింద భూమి పొందే నానావిధాలైన ఔదార్యాలకు, నిన్ను ఉత్తమంగా ప్రదర్శింప చేసేదానివలె పరివర్తనగావించు.

యదార్థంగా నీవు మా ప్రభువువు: సమస్త వస్తు ప్రభువువు. నీకు చెందిన వస్తువులకోసం వేదనపడుతూ, మేము మిమ్మల్ని నీ హస్తాలల్లోనికి వశమైపోయేటట్లు చేసుకొంటాము.

48. ఓ ప్రభూ! నీ నామం కీర్తినీయమగుగాక! సత్యానికి నీవు నా దేవుడవు, ప్రియుడవు అయిఉండగా నేను ఎవరి రక్షణను స్వీకరిస్తాను; నీవు నా ప్రభువువు, నా గురువర్యుడవు అయిఉండగా నేను శరణుకోసం ఎవరిదగ్గరకు పర్యటిస్తాను: సత్యానికి నీవు నా యజమానివి, నా సమాధిస్థానానివి అయి ఉండగా నేను ఎవరి దగ్గరకు పరుగెత్తుతాను: సత్యానికి నీవు నా కోశానివి, ఆసక్తిలక్ష్యానికి అయిఉండగా నేను ఎవరిని అర్థిస్తాను; నీవు సత్యానికి నా అత్యున్నత–ఆశయానివి, అత్యుత్తమ–ఆసక్తివి అయిఉండగా నేను ఎవరిద్వారా నీ ముందు వాదిస్తాను? నీ స్వర్గమహత్వానికి పరితాపపడటం తప్ప ప్రతి–ఆశ భగ్నం చేయబడ్డది; నీ దీవెనల కూపోల్చటానికి చేర్చే చిన్నద్వారం తప్ప ప్రతిద్వారం అడ్డుపెట్టబడ్డది.

ఓ నా ప్రభూ! నీ అత్యధిక తేజఃప్రకాశంతో – ఎవరి దీప్తి ముందు ప్రతిజీవి వినయంతో వంగుతుందో, నీకోసం పూజించటానికి ప్రణమిల్లుతుందో, నీ ప్రకాశంతో ఎవరి ప్రసరణముందు

అగ్ని జ్యోతిస్సు ఔతుందో, మృతిచెందినవారికి ప్రాణం తీసుకొనిరాబడుతుందో, కష్టం సుగమంగా మార్చబడుతుందో ఆ నిన్ను వేడుకొంటున్నాను. ఓ అజేయాధికారానికి ప్రభువైన నీవా! ఈ మహోన్నతమూ, ఆశ్చర్యకరమూ అయిన ఈ నీ ప్రకాశంతో, ఈ నీ అత్యుత్తమ సార్వభౌమత్వ కీర్తితో, నీ ఔదార్యం ద్వారా మమ్మల్ని దేనిని నీవుమాత్రమే కలిగిఉన్నావో దానిలోనికి మార్చటానికీ, మమ్మల్ని నీ కాంతి - ఉల్బణాల మధ్యే సమర్థులను చెయ్యటానికి నీ శ్రేష్ఠమైన రాజ్యప్రభావాన్ని ఏది వేడుకుంటుందో దానిని మాకు ఔదార్యంతో ప్రసాదించడానికీ పూనుకోమని నిన్ను ప్రార్థిస్తున్నాను ఓ ప్రభూ! నీకోసం నా చేతులు పైకెత్తాను; నేను నీలో రక్షణకు ఆధారమివ్వటాన్ని ఓ ప్రభూ! గమనించాను. ఓ ప్రభూ! నీకోసం నన్ను నేను విడిచిపెట్టాను; ఓ ప్రభూ! నా సమస్తమైన విశ్వాసాన్ని నీమీద ఉంచాను. ఓ ప్రభూ! నీవల్ల నేను బలపర్చబడ్డాను.

నిశ్చయంగా శక్తిగాని బలంగాని నీలో తప్ప లేదు.

49. ఓ ప్రభూ! నా అతిక్రమణలు నీ ఎదుట నా ముఖాన్ని అవమానంతో ముంచివేశాయి, నీముందు నా వీపును భారవంతం చేసివేశాయి. నాకు నీ సుందరమైన ముఖానికి నడుమ చేరాయి, ప్రతివైపునుంచి నన్ను ఆవహించాయి. నీ దివ్యశ_ ఆవిష్కరణకు ప్రవేశాన్ని పొందటంనుంచి నన్ను అన్నివైపులా అడ్డగించాయి అని నేను ఎరుగుదును.

ఓ ప్రభూ! నీవు నన్ను క్షమించకపోతే అప్పుడు అక్కడ క్షమించటానికి ఎవరున్నారు? నీకు నామీద కరుణలేకపోతే కనికరాన్ని ప్రదర్శించటానికి ఎవరు సమర్థులు? నీకు కీర్తి

కల్గుగాక, నాకు అస్తిత్వం లేనప్పుడు నీవు నన్ను సృష్టించావు. నాకు ఎటువంటి జ్ఞానం లేనప్పుడు నీవు నన్ను పోషించావు. నీకు ప్రశస్తి కల్గుగాక, ఔదార్యనిదర్శనం ప్రతిదీ నీ దగ్గర నుంచి బయలుదేరుతుంది; అనుగ్రహ చిహ్నం ప్రతిదీ నీ నిర్ణయకోశాలనుంచి బయటికి వస్తున్నది.

50. ఓ నా ప్రభువా! నిన్ను గురించిన ప్రకటన తప్ప ప్రతి ప్రకటనకూ, నీ ప్రశస్తికి తప్ప ప్రతి ప్రశస్తికీ, నీ సామీప్యానికి సంబంధించిన ఉల్లాసానికి తప్ప ప్రతి-ఉల్లాసానికీ, నీలో చేరికవల్ల సౌఖ్యానికి తప్ప ప్రతి సౌఖ్యానికీ, నీ ప్రేమ పరమసౌఖ్యాలవల్ల సంతోషానికి తప్ప ప్రతి సంతోషానికి, నీతో సంబంధం వహించక నాకు చెందిన వస్తువులకు ఎవరు ప్రభువులకు ప్రభువైన ప్రభువో ఆయన అయిన ఓ నీవా! ఎవరు సాధనలను ప్రసాదించి ద్వారాలను తెరుస్తాడో ఆయన అయిన ఓ నీవా! నన్ను క్షమించడానికి నిన్ను వేడుకుంటున్నాను.

51. ఓ దేవా. నీకు ప్రశస్తికల్గుగాక! సర్వవస్తువులకు పూర్వము ఉన్నవాడివి, సర్వవస్తువులకు తరువాత ఉండే వాడివి, సర్వవస్తువులకు పైగా ఉండేవాడివి అయిన నీవు దేవుడవు. సమస్త వస్తువులను ఎరిగినవాడివి, సమస్త వస్తువులమీద సర్వాతిశయుడవు అయిన నీవు దేవుడవు. అన్ని వస్తువులతో అతికరుణతో వ్యవహరించేవాడివి, అన్ని వస్తువుల మధ్య న్యాయనిర్ణయం చేసేవాడివి, ఎవరిదృష్టి అన్ని వస్తువులను ఆక్రమిస్తుందో ఆయనవు అయిన నీవు దేవుడవు. నా ప్రభూ, నీవు దేవుడవు. నీవు నా స్థితిని ఎరుగుదువు. నా అంతరికము, బాహ్యము అయిన ఉనికిని నీవు గమనిస్తావు.

నాకు, నీ పిలుపుకు సరిపడే ప్రత్యుత్తర మిచ్చే విశ్వాసులకు నీ క్షమాపణను ప్రసాదించు. ఏది నాకు దుఃఖాన్ని కల్పించ టానికి ఆశిస్తుందో లేక నాకు కీడును కోరుతుందో దాని దుష్ట త్వానికి వ్యతిరేకంగా నీవు నాకు తగిన సహాయకుడవు గా ఉండు. రూఢిగా నీవు సృష్టింపబడ్డ సమస్త వస్తువులకు ప్రభువువు నీవు లేకుండా ఏది అత్మయోగ్యత కలది ? కాకుండా ఉంటే నీవు ప్రతిదానికి యోగ్యతను అనుగ్ర హిస్తావు.

52. నీ కీర్తితో గూడిన ముఖ దీప్తి శోభతో, నీ పురాతన మహత్వప్రాభవంతో, నీ సర్వోత్కృష్ట సార్వభౌమత శక్తితో ఈ సమయాన మాకు ఉత్తమమైనదీ, యుక్తమైనదీ అయిన ప్రతి కార్యాన్నీ అనతిమ్మని. మాకు నీ అనుగ్రహప్రదానాల భాగాన్ని విధింపమని నిన్ను ప్రార్థిస్తున్నాను. దానములను ఇవ్వటం నీకు నష్టాన్ని కల్గించకుండుగాక; ఇష్టాలను ప్రసా దించటం నీ సంపదలను తగ్గించకుండుగాక.

ఓ ప్రభూః నీవు ప్రశంసనీయుడవు! సత్యంగా నీవు ధని కుడవై ఉంటే నేను పేదనుః సత్యంగా నీవు ప్రాభవంకలవాడ వైతే నేను రూఢిగా అల్పుడనుః సత్యంగా నీవు శక్తివంతుడ వైతే రూఢిగా నేను అసర్థుడను; సత్యంగా నీవు అత్యున్నతమో న్నతుడవైతే రూఢిగా నేను అణగిపోయినవాడిని; సత్యంగా నీవు బలానికి ప్రభుడవైతే రూఢిగా నేను ఆపదను అనుభ విస్తుంటాను.

53. ఓ ప్రభూ! నీవు సృష్టించిన ప్రతి ఉత్తమ వస్తువును లేదా సృష్టింపనున్న ప్రతి ఉత్తమ వస్తువును నీవు నాకు లిగే

ఓట్లూ విధించుః నీవు ఉండటానికి ఏర్పరిచిన వస్తువులలో నుంచీ, నీవు అసహ్యించుకొనే ఏ క్లిష్టమైనదాన్నుంచీ అయినా నీవు నన్ను రక్షించు. నిశ్చయంగా నీవు తప్ప దేవుడు లేడుః నీవు ప్రశంసింపబడుదువుగాక. స్వర్గాలలో గాని, భూమిమీద గాని ఏదీ వీటిమధ్య నీ ప్రయోజనాన్ని ఎప్పుడూ విఘాత పరచలేవు. నిశ్చయంగా నీవు సమస్త వస్తువులమీద శక్తివంతుడవు.

ఓ నా దేవా! ఏ ఒకరైనా నీ ప్రియమైన దయను లేదా అనుగ్రహాన్ని అన్వేషించటానికి నీ అస్తిత్వ-ఉత్కృష్టత నుంచి దూరంగా ఉంచుః ఏ ఒక్కరైనా నీవు ఇచ్చేవాటికి, నీ మృదు కారుణ్యానికి నిదర్శనాలను వేడితే వాటిని నీ సర్వోత్కృష్ట కీర్తినుంచి దూరంగా ఉంచు. నీ ఉదాత్తమైన రాజ్యాన్ని ప్రియమైన జాతుల ఆవిష్కరణను దర్శించటానికి ఏ జీవికైనా నివు మహోన్నతుడవు; నీ దీవెనలను నీ స్వర్గ-ఔదార్యాన్ని, అనుగ్రహాన్ని వెళ్ళబోయటాన్ని అర్థించటానికి ఏ ఒక్కరికైనా నీ ప్రశస్తి అతి పవిత్రమైనది. ఏది నానావిధానాలైన ఔదార్యాలను కలిగిఉందో ఆ నీ స్వర్గభూరాజ్యమంతటా ఏదైనా ఏకత్వం ఎక్కడ ఆరోపింపబడుతుందో దానికిపైన నీవు అపరిమితంగా కీర్తింపబడ్డావు.

ఓ నా దేవా! నేను నిన్ను అర్థించే సమస్తం నా శరీరంలో నుంచి, నా ఆత్మ వెళ్ళిపోయేముందు నీ ఉత్తమ సౌఖ్యం నాకు క్షణకాలం, ఆవగింజలో కోటానకోటివంతు ఇవ్వబడ్డప్పటికీ దాన్ని పొందే సమర్థుణ్ణి చేయమనటం మాత్రమే. నీవు నాతో ఇష్టపడ్డప్పుడు నా ఆత్మ వెళ్ళిపోయే సమయంలో నేను ప్రతి వ్యాపారంనుంచీ లేదా వ్యాకులత నుంచీ స్వేచ్ఛగా ఉంటాను;

నీవు నాతో అయిష్టపడ్డపుడు అది నన్ను వీడిపోతే నేన ఉత్తమమైన ప్రతిచర్యనూ చేసినా ఏదీ ఎందుకూ సాం పడదు। నేను ప్రతి గౌరవాన్ని, కీర్తిని అర్జించినా నన్ను ఉ త్తముడిని చేయటానికి ఉపయోగించదు.

ఓ నా దేవా! అందువల్ల నిరంతరం నీవు నీ రాష్ట్ర ప్రజలకు అత్యధిక ఔదార్యదేవుడవై ఉన్నందువల్లా, నీ అనంత  క్తిత్వం గల స్వర్గంలో నివసించేవారందరికీ అతి రమణీయ బ  మాన ప్రభువు కావటంవల్లా నీవు నీ దగ్గరకు నన్ను ఆరోహి పచేసేటప్పుడు, నన్ను నీ ముందు కన్పింపచేసేటప్పుడు నీ ఉత్తమ సౌఖ్యాన్ని నా ఎడ అనుగ్రహంతో ప్రసరింపమని నిన్ను మనః పూర్వకంగా వేడుకుంటాను.

54. నీ ప్రవచనాన్ని ఉన్నతం చేసినందుకు, నీ ది వ్యమైన ఏకత్వాన్ని ప్రశంసించినందుకు ఎవరు నీ మార్గంలో ఘోరమైన అవమానానికి బయటపెట్టబడ్డారో ఆ అసంఖ్యా  వ్యక్తులెందరో అందరికీ ప్రాణోత్సర్గం జరిగింది! నీ ది వ్యమత సంఘ ప్రామాణికత్వాన్ని నిరూపించటానికి, నీ ప్రశస్తి  కొనియాడటానికి నీ మతంకోసం రక్తం ఎంతో విస్తారంగా  వింపబడ్డది! నీ పవిత్రతా విస్తృతిని నిరూపించటానికీ నీ ప్రశస్త నామాన్ని శ్లాఘించటానికీ తోడ్పడే నీ ప్రేమమార్గంలో తప్ప డుగా ఆక్రమించబడ్డ అస్తుల వైపుల్యం ఎంతో ఉన్నది! నీ పవిత్ర ప్రవచనాన్ని విస్తరింపజేయటానికీ, నీ కీర్తిని ప్రశంసించ టానికి ఎన్నో అసంఖ్యాకపాదములు ధూళిని త్రొక్కుతూ నడిచ యి! దుఃఖోద్ధృతిని పొందిన కంఠాలు, భీతితో కొట్టబడ్డ హృదయ లు, నీవు తప్ప గణింపలేని చింతాపూరితమైన ఆపదలు, నీకు తప్ప తరు లెవరికైనా అతి గూఢమైన అగచాట్లు, బాధలు— ంతో

అసంఖ్యాకంగా ఉన్నవి; ఓ నా ప్రభూ! ఇవన్నీ నీ పావనత్వాధిక్యాన్ని స్థాపించటానికే; నీ కీర్తి మహోన్నత లక్షణాన్ని ప్రకటించటానికే

సృష్టింపబడ్డ వస్తువులన్నీ నీవు తప్ప ఇతరమైన అభావం కోసం అస్తిత్వానికి తీసుకోరాబడ్డాయని సాక్ష్యం వహించటం కోసం ఈ నిర్ణయాలన్నీ నీ చేత ఆజ్ఞాపింపబడ్డాయి. నీ పవిత్రమైన ఉనికితో ఏది సంబంధం కలిగిందో అది వారిని సంతోష పెట్టి ఇతరంకంటే చాలా ఉత్కృష్టము, ఉన్నతమూ అన్న నిశ్చయతను వారు గ్రహించేటందుకు నీవు వాళ్ళ హృదయలకు ప్రశాంతతను తెచ్చే వస్తువులను ఆపివేశావు; ఎందువల్లనంటే నీ అజేయాధికారం అన్ని వస్తువులలోను వ్యాపించి ఉంటుంది కనుక; ఏదీ ఎన్నడూ దాన్ని విచ్ఛినం చేయలేదు గనుక.

నీ దివ్యైక్యతకు గల అత్యాధిక్యతను ప్రదర్శించటానికీ, నీ పవిత్రాతిశయతను నిశ్చయించటానికి వారు నీచేత ఆజ్ఞాపింపబడ్డారని దర్శనస్థితి ప్రదానం చేయబడ్డవారు గ్రహించేటందుకు నిశ్చయంగా నీవు ఈ అవశ్యకరాలైన ఘటనలు జరగటాన్ని కల్పించావు.

నేను జీవించితీరవలె నన్న నిశ్చయాన్ని ఎరుగుదును. ఎవరికి వెనుక ఏ ఇతరదేవుడు లేడో ఓ ఆ నీవా, సమస్త ప్రశస్తి నిన్ను చెందుగాక!

నీ దగ్గరకు ఆరోహించటానికీ, నీ సామీప్యాన నివసించే గౌరవం ప్రసాదింపబడటానికీ, నీ ఒక్కనితోటే సంయోగాన్ని పొందటానికీ ఔదార్యంతో నన్ను సమర్థుణ్ణిగా రూపొందించు. నీవు తప్ప మరి ఏ దేవుడూ లేడు.

నీవు ఏ నీ సేవకుని హృదయసీమ నుంచి, కేవ॰ ము నీ స్వీయానికి సంబంధించిన హృదయసీమ నుంచి, ప్ర ఇతర ఉచ్చారణను లేదా ఇచ్ఛను తుడిచిపెడతావో అత కి వర మిచ్చి తీరుతావు; ఏ సేవకుని హస్తాలు నీ ముకురం ఎదుటా అసత్యప్రవర్తన చేస్తే ఈ ప్రపంచ లాభాలతోటి, ॰ సువాతి ప్రపంచపు లాభాలతోటి అతడు మునిగిపోయి అందు॰ ॰ నీకు సంబంధించిన జ్ఞాపకాన్ని మరిచిపోయేటట్లు పరీక్షి ॰యుటం కోసం నీవు అతడి ఎడ దోషాన్ని విధించి తీరుతావు.

58. నీ ఆజ్ఞాధికారం ద్వారా సృష్టింపబడ్డ సమస్త ॰స్తువు లకు ఉనికిని కల్పించిన నీవైన ఓ ప్రభూ! నీకు ॰ ఖ్యాతి కలుగుగాక!

ఓ ప్రభూ! నిన్ను తప్ప సర్వాన్ని త్యజించినవారికి ॰ హాయ పడు; వారికి శక్తివంతమైన విజయాన్ని అనుగ్రహించ॰ . నీ సేవకులకు సాయపడటానికీ, సాయపడి వారిని బలవం॰ ॰లను చేయటానికీ. విజయాన్ని పొందేటందుకు వారిని సమ॰ ॰లను చేయటానికీ, వారిని పోషించటానికీ, వారిని కీర్తితో ॰ ర్తింప చేయటానికీ, వారికి గౌరవాన్ని ఉన్నతిని అనుగ్రహించ॰ ॰నికీ, వారిని సంపన్నులను చేయటానికీ, వారిని ఆశ్చర్యక మైన గెల్పుతో విజయవంతులను గావించటానికీ స్వర్గం ను ॰చి, భూమినుంచి రెంటిమధ్య ఉన్న అంతటినుంచి దేవద ॰తల సమాజాన్ని వారి దగ్గరకు పంపించు.

నీవు వారి ప్రభువువు, భూ స్వర్గాల ప్రభువువు, సర్వ ప్రపంచాల ప్రభువువు. ఈ సేవకుల శక్తిద్వారా ఓ ప్ర॰ భూ, ఈ విశ్వాసాన్ని బలపరుచు; ప్రపంచంలోని అందరు ॰ జల ॰ద వారి సమ్మతి ప్రవర్తించేటట్లు కల్పించు; ఎండ వల్ల

నంటే సత్యయుతులైన వారు నీవు తప్ప మిగిలిన అంతటి నుంచి తమను విడిచేసికున్న సేవకులు; నీవు నిశ్చయంగా సత్యయుత విశ్వాసపరులకు రక్షకుడవు.

ఓ ప్రభూ, నీవు దీని ఎడ – అంటే నీ మీరరాని విశ్వాసం ఎడ, భక్తితో స్వర్గాలల్లోను, భూమిమీద. వీటిమధ్య ఏముంటే దానిలోను వారిహృదయాలు దేనికంటే నైనా బలిష్టంగా పెరిగే టట్లు అనుగ్రహించు. ఓ ప్రభూ, సమస్త మానవజాతి దృష్టి ముందు నీ శక్తిని ప్రత్యక్షం చేయగల్గేటట్లు నీవు వారి హస్తాలను నీ ఆశ్చర్యకరమైన శక్తిచిహ్నలతో బలపరుచు.

59. ఓ ప్రభూ! నేను ఆశ్రయంకోసం నీ దగ్గరకు చేరుతాను; నేను నా హృదయాన్ని నీ సంకేతా లన్నిటిమీద నిలుపుతాను.

ఓ ప్రభూ! నేను ప్రయాణంచేస్తున్నా లేదా ఇంట్లో ఉన్నా, నా వృత్తిలో ఉన్నా, లేదా ఇతరమైన పనిలో ఉన్నా, నా సమస్త విశ్వాసాన్ని నేను నీలో నిలుపుతాను.

దయలో ఎవరూ అతిశయించలేని ఓ నీవా! అన్ని వస్తువులనుంచీ నన్ను స్వతంత్రుణ్ణి చేయటంకోసం తగిన నీ సహాయాన్ని అప్పుడు నాకు అనుగ్రహించు.

ఓ ప్రభూ, నీ ఇష్టానుసారంగా నా ప్రవర్తనభాగాన్ని నాకు అనుగ్రహించు; దేనిని నీవు నాకు విధించావో దానివల్ల నన్ను తృప్తిపడేవాడినిగా రూపొందించు.

నీది ఆజ్ఞాపించటానికి అతి నిరంకుశమైన అధికారము.

60. ఓ ప్రభూ! నీవు ప్రతి పరితాపాన్ని నివారించేవాడివి; ప్రతి వ్యసనాన్ని నివృత్తిచేసేవాడివి. నీవు ఎవరు ప్రతిదుఃఖాన్ని

బహిష్కృతంచేస్తాడో ఎవరు ప్రతి బానిసను స్వతంత్రుణ్ణి చేస్తాడో ఆతడివి; ప్రతి జీవికి విమోచకుడివి. ఓ ప్రభూ! నీ కారుణ్యంద్వారా మోక్షాన్ని ప్రసాదించి నన్ను విముక్తి లాభాన్ని సంపాదించిన నీ సేవకులలో ఒకణ్ణిగా గుర్తించు.

61. నీవు తప్ప ఇతరులందరూ అవసరం కలవాళ్ళు, దరిద్రులు అయి ఉంటుంటే ఓ నా ప్రభూ! నీవు నిత్యత్వం సర్వం ఏకైక సత్యదేవుడివిగా ఉన్నావు; ఎప్పుడూ ఉంటావు. ఓ నా దేవా! నేను నీ పగ్గాన్ని విడువకుండా పట్టుకొని ఉండి నన్ను మానవజాతినుంచి విడదీసుకొన్నాను; నేను నీ కోమల కరుణారసనివాసంవైపు నా ముఖాన్ని నిలుపుకొని సృష్టి పబద్ధ సమస్త వస్తువుల దగ్గరనుంచి మారిపోయాను. శక్తివంతుడు, సర్వజ్ఞుడు అయిన ఏ ఒక్కడిని నీ ప్రక్కన చూడలేదు గనుక ఓ నా దేవా! నీ ఔదార్యదాతృత్వాల మూలంగాను నీ కీర్తి ప్రభావాల మూలంగాను నీ రాజ్య వైభవాల మూలంగానూ నన్ను అనుగ్రహంతో ప్రేరేపించు. నీలో తప్ప ఎవరిలోను నేను నా విశ్వాసాన్ని పూర్తిగా నిలుపలేను గనుకను, నీవు తప్ప నాకు వేరే ఆశ్రయం లేదు గనుకను, ఓ నా దేవా, సర్వ శ్రేష్టము, సర్వసమర్థము అయిన నీకీర్తిశక్తివల్ల, సర్వోత్కాల అతిథేయులవల్ల నన్ను రక్షించు.

నా ప్రభూ! నీవు దేవుడవు; నీవు నా అవసరాలను ఎరుగుదువు; నీవు నా స్థితిని చూస్తున్నావు; నీ శాసనం కారణంగా నాకు ఏమి ఏర్పడ్డదీ నీవు బాగా ఎరుగుదువు; నీవద్ద సెలవు పుచ్చుకోవటంవల్ల నేను సహించిన భౌగోళిక బాధలు నీ ఔదార్యానుకూల్యాల చిహ్నలుగా ఎలా నన్ను చెందాయో ఆ వాటిని నీవు బాగా ఎరుగుదువు.

62. ఓ నా దేవా! మహనీయతల మహనీయత, అత్యంత శోభావంతమైన నీయందు నిల్చుగాక! నీ మాననీయత ఏ మానవీయప్రేరణ చేరుకోలేనంత సర్వశ్రేష్టమైనది; నీ సిద్ధమైన పరిపూర్ణాధికారం మానవుల హృదయ మనశ్శకుంతాలు దాని ఉన్నతత్వాలను అందుకోలేనంత అత్యున్నతమైనది. నీ స్థానానికి తగ్గట్లుగా నిన్ను ప్రశంసించటానికి సర్వప్రాణులు తాము శక్తిహీనులమని అంగీకరిస్తవి. నీవు గణనాతీతుడవు; నీ ఉనికి నీ అంతరంగికసారంలో ఉండటంవల్ల, నీవు నీలోనే ఉండటంవల్ల నిన్ను నీవు మాత్రమే ఎరగటంవల్ల, దానిని ఎవరూ కీర్తింపలేరు; అంతేకాదు, నీ ఔదార్య నిదర్శనాలను ఎవరు పరిగణించలేరు.

ఓ ప్రభూ, మా దేవా! సృష్టికల్పనల రాజ్యాన్ని ఉనికిలోనికి పిలిచి, నేను నీకు ప్రశస్తిని – నీవు తప్ప సముచితంగా శ్లాఘించలేని నీ మహోద్రేక సామర్థ్యం ద్వారా శోభాయమానంగా ప్రకాశించే ప్రశస్తిని పండిస్తాను. అంతేకాక యోగ్యమై బయాన్‌ను ప్రేరేపించే నీ ప్రత్యక్షతకు ఉదార వరప్రదానము నీ ఆవిష్కరణ సృష్టి రాజ్యాలల్లో రూపొందే అద్భుత చిహ్నము అయిన నీ మహాధికార మహనీయతా ఖ్యాతికి తగ్గట్లు నిన్ను కీర్తిస్తాను; వందనాలను అర్పిస్తాను.

నీకు సమస్తఖ్యాతి వర్తించుగాక! నీకు యోగ్యమైనది పరిగణనకు అతీతమైన ఉన్నతి గలది. నిశ్చయంగా ఏ ఒక్కరూ నీ స్థానగాంభీర్యాన్ని సముచితంగా గ్రహించలేదు; లేదు, నీవుతప్ప ఏ ఒక్కరూ నీ యోగ్యతకు తగ్గట్లు నిన్ను సమ్మతించలేదు. నీవు తప్ప ఏ ఇతరులు నీ ఆవిష్కరణమహనీయ

తను గుర్తించలేనప్పుడు నీ ఔదార్యాన్ని వెళ్ళబోసి నీవు ప్రత్యక్షమౌతావు.

నీ నామం మహోదాత్తమౌగాక. నీవు తప్ప నీ ప్రకృతిని సూచించే సామర్థ్యంతో ఇతరమైనది ఏదైనా ప్రత్యేకమైన అస్తిత్వాన్ని కలిగి ఉన్నదా? నేను నిన్ను గుర్తించగల సామ్యసూచనను నీవు తప్ప ఇతరులెవరైనా పొందిఉన్నారా? తెలుసుకోబడ్డదంతా తన ప్రసిద్ధికి, మహాప్రసిద్ధమైన నీ నామ శోభకు బాధ్యతవహించి ఉన్నది; ప్రతివస్తువు నీ అజేయమైన ఇచ్ఛనుంచి బహిర్గతమయ్యే సంచలనరూప ప్రేరణవల్ల గాఢంగా చలనాన్ని పొందింది. అన్ని వస్తువులకంటే నీవు అన్ని వస్తువులకు అతి సన్నిహితంగా ఉన్నావు.

నీవు ప్రశస్తుడవు, ప్రఖ్యాతుడవు. నిన్ను చేరటానికి అనుగ్ర హింపబడ్డవాడికి నీ మహనీయత అత్యున్నతము; నీ అగాధమైన నిమ్నత మానవుల మనోజ్ఞాననదులకు అక్కడినుంచి ప్రవ హించటానికి మహా గంభీరమైనది.

63. నా ఆత్మవేదనను ఉపశమింపజేయటానికి ఓ నా దేవా, నీవు తప్ప ఇతరుడు ఏ ఒక్కడూ లేడు; నీవు నా అత్యున్నత మైన ఆశయానివి. నా హృదయం నిన్ను తప్ప ఏ ఇతరుడిని వరించలేదు; నీవు ప్రేమించినట్లు అది ప్రవర్తిస్తుంది. నా ప్రాణం, మరణం రెండూ నీకోసమే అని నేను గంభీరంగా ప్రకటిస్తున్నాను. నిశ్చయంగా నీవు సామ్యం లేనివాడివి; భాగస్తుడు లేనివాడివి.

ఓ నా ప్రభూ! నీ దగ్గరనుంచి నన్ను దూరంగా మూసి వేసు కున్నందుకు నేను నిన్ను 'నన్ను క్షమించ' మని వేడుకుంటు న్నాను. నీవు నాకు నిన్ను తెలియజేయటం, నీ స్థానానికి తగ్గ

ట్లుగా నిన్ను నాకు జ్ఞాపకమయ్యేటట్లు కల్పించటానికి పిలపటం చేసినా నీ కీర్తి మహనీయతలతో నిన్ను గుర్తించి నిన్ను పూజించటంలో నేను అపజయాన్ని పొందాను. ఓ నా ప్రభూ! నా దుశ్చర్యలు, అతిక్రమణలు కారణంగా నీవు నన్ను పట్టుకుంటే నాకు దుఃఖకరమైన ఆపద సంభవిస్తుంది. నేను నీకంటే వేరొక సహాయకుడిని ఎరుగను. నేను పరుగెత్తి వెళ్ళి చేరటానికి నీవుతప్ప వేరే శరణ్యుడు లేడు. నీవు సృష్టించిన వారిలో ఎవడూ నీ అనుజ్ఞలేకుండా నీతో మధ్యవర్తిగా వర్తించటానికి సాహసించడు. నేను నీ ఆస్థానంలో నీ ప్రేమకోసం పట్టుబడతాను; నీ ఆజ్ఞను అనుసరించి నీ కీర్తికి యోగ్యంగా నేను నిన్ను మనఃపూర్వకంగా ప్రార్థిస్తాను. నీవు ప్రతిజ్ఞ చేసినట్లు నా పిలుపును పట్టించుకోమని నిన్ను యాచిస్తాను. నిశ్చయంగా నీవు దేవుడవు; నీవు తప్ప దేవుడు మరొకడు లేడు. ఏకాంతుడవు, అసహాయుడవు అయిన నీవు సమస్త సృజిత వస్తువులకు స్వతంత్రుడవు. నీ ప్రేమికుల భక్తి నీకు లాభాన్ని చేకూర్చదు: లేదా విశ్వాసరహితుల దుశ్చర్యలు నీకు కీడును కలిగించవు. నిజంగా నీవు తన ప్రతిజ్ఞలో ఎన్నడూ తప్పిపోని వాడవైన నా దేవుడవు.

ఓ నా దేవా! నీ పవిత్ర ప్రత్యక్షతకు సంబంధించిన మహనీయ—ఔన్నత్యాల దగ్గరకు చేరటానికి అంగీకరించేటందుకు నీవు తప్ప తప్పనిసరియైన ఇతరుల నిశిత సూచనలవంకకు నా ఆత్మను వాలేటట్లు చేసుకోవటం నుంచి రక్షించేటందుకు నేను నిన్ను నీ అనుగ్రహ నిదర్శనాల మూలంగా అభ్యర్థిస్తాను. ఏది నీకు అంగీకారయుతమో, తృప్తికరమో అక్కడికి, ఓ నా దేవా, నా పాదాలను నడిపించు. నీ బలంద్వారా నీ

క్రోధ దండనల ఉన్మత్తత నుంచి నన్ను రక్షించు; నీ వు ఇష్ట పడని నివాసాలల్లో ప్రవేశించడం నన్ను వెనుకగా అపివే యి.

64. ఓ నా దేవా! నీ విఖ్యాతికి యోగ్యంగా నిన్ను లుసు కోవటంలో నేను అపజయం పొందాను; నా స్థానానికి త ట్టుగా నిన్ను భయపెట్టడంలో ఈ స్థితిలో నేను నిన్ను ఎలా ఏ ధంగా ఉదహరించగలను? నిన్ను పూజించటమనే కర్త వ్యంలో పతితుడ నైనప్పుడు నేను ఏ రీతిగా నా ముఖాన్ని నీ ంకన నిలుపగలను?

నీవు సర్వశూన్యమైనప్పుడు నిత్యంగా ఉండే దే వుడవు కావటంవల్ల లోపరహితంగా నిరూపితమై కన్పించే శక్తి పుష్టిని ప్రదర్శించేందుకు నీవు నన్ను వర్తింపచేయట కోసం పిలువలేదు; అంటే నీ స్మృతికి చెందిన దేదీప్యమాన ( దర్శ నకు ముందు మమ్మల్ని గుణించి ఉదారంగా బహుశః కేవల ప్రకటనచేసి నీ మహోత్కృష్ట శక్తిమూలంగా నీవు మ మ్మల్ని సృష్టించావన్న మాట.

ఓ నా దేవా, దేనితో నీ ఆత్మను నేను గుర్తుపట్టేట దుకు మీరు వీలు ఉండేటటువంటిదైన నీవు నాకు బోధించి అ జ్ఞానం తప్ప — నా అపజయాన్ని పాపపంకిలతను మా త్రమే ప్రతిఫలింపచేసే జ్ఞానం తప్ప — నాకూ నీకూ సంబంధి చిన మరొక జ్ఞానం లేదు. ఓ నా దేవా, ఇక నేను ఇక్కడ నీకు పరిపూర్ణంగా సమర్పితుడనై నీవు దేనిని ఆశిస్తున్నావో నిని నిర్వర్తించటానికి ఇష్టపడుతున్నాను. నీవు దేవుడవని, నీవు తప్ప వేరు దేవుడు లేడని, నీకు సాటి అయినవాడు లే డని, నీకు భాగస్తుడు లేడని, శూన్యం నీవలె ఉందనీ ఒప్పుకు టూ నేను వినయంతో నీ కారుణ్యావిష్కరణ ముందు న్ను

పడవేసుకొన్నాను. నీ విఖ్యాతిగా ఘనంగా రూపొందే ఈ దీనికి నీకు నీవే సాక్ష్యంవహిస్తావు.

65. ఓ నా దేవా, నా ప్రభూ, నా యజమానీ! నేను నన్ను నా బంధువర్గంనుంచి విడబర్చుకొన్నాను; భూమిమీద నివసించే అన్నిటిలో స్వతంత్రుడిని కావటానికి ఏది నీ దృష్టిలో ప్రశంసాయోగ్యమైనదో దానిని స్వీకరించటానికి నిరంతరం సంసిద్ధుడనుగా ఉండటంకోసం నీ ద్వారా అన్వేషించాను. నీ నుంచి తప్ప ఏ ఇతరంనుంచి అయినా నన్ను స్వతంత్రుడిని చేసే మంచిని నాకు ప్రసాదించు; అపరిమితాలైన నీ అనుగ్రహాలల్లో విశేష భాగాలను నాకు దానమివ్వు. నిశ్చయంగా నీవు కృపావిశేషతకు ప్రభువువు.

66. ఓ నా దేవా! నేను నీ శక్తినిబట్టి నిన్ను నియమిస్తున్నాను! పరీక్షాసమయాలల్లో ఏ ఆపదలు నన్ను ఆవరించకుండుగాక. అలక్ష్యక్షణాలల్లో నా పాదాలను నీ ప్రేరణతో సక్రమంగా నడిపించు. నీవు దేవుడవు; దేనిని నీవు ఇష్టపడతావో దానిని నిర్వర్తించటానికి సమర్థుడవు. ఎవడూ నీ ఇచ్ఛను ఆటంకపరచలేడు; లేదా నీ ప్రయోజనాన్ని విఘ్నం చేయలేడు.

67. ఓ నా దేవా, నేను నీ క్షమాపణను యాచిస్తాను; ఈ సేవకులు తమను నీదగ్గరకు నడుపుకోవటానికి నీవు ఆశించే విధానాన్ని అనుసరించి నేను ఆ క్షమాపణను అర్థిస్తాను. నీ ప్రభుతకు సముచితంగా మా పాపాలను ప్రక్షాళనం చేయటం కోసం నన్ను, నా మాతాపితరులను నీ అంచనాలో. నీ సర్వాతిశయ సార్వభౌమత్వానికి తగ్గ విలువగలది అయిన పద్ధతితో

ఎవరు నీ ప్రేమనివాసంలో ప్రవేశించారో వారిని క్షమించ టం కోసం నేను నిన్ను వేడుకుంటాను.

ఓ నా దేవా, నీవు దాని విజ్ఞాపనను నీకు అర్పించ ని నా ఆత్మను ప్రేరేపించావు; కాని నేను నీకోసం తప్ప ని ప్పి పిలువను. నీవు ప్రశస్తిని పొందావు; ప్రఖ్యాతిని స్వీకరించ వు: నీవు నాకు నిన్ను తెలియజేసినందుకు నేను నీకు ప్రశ ని సమర్పిస్తాను; నిన్ను తెలుసుకోవటానికి నేను పతనా న్ని పొందటం, నీ ప్రేమమార్గంలో పయనించే విషయంలో ప్ప పోవటం జరిగాయి. కనుక నేను నిన్ను "నన్ను క్షమించు" ని వేడుతున్నాను.

68. మా దేవుడవైన ఓ ప్రభూ, నీ పేరు ప్రశస్తిని పొం ను గాక! సత్యానికి నీవు అప్రత్యక్ష వస్తువులను ఎరిగిన విజ్ఞా ని. నీ సర్వాన్నీ అణగించి నిలుపుకున్న విజ్ఞానం పరిగణించటా కి యోగ్యమైన మంచిని మాకు నియమించు. నీవు సార్వభౌమ వ ప్రభువువు, సర్వశక్తుడవు, అత్యుత్తమ ప్రియుడవు.

ఓ ప్రభూ, సర్వప్రశస్తి నిన్ను చెందుగాక - మేము ని త మైన దినంనాడు నీ ఔదార్యాన్ని అన్వేషిస్తాము; మా సమ స్త విశ్వాసాన్ని మా ప్రభువైన నీలో ఉంచుతాము. ఓ దేవా, వు కీర్తితుడవు! ఏది ఉత్తమమైనదో దానినీ, నీవు కాక సమస్తా విడిచిపెట్టే సామర్థ్యాన్ని మా కిచ్చే యోగ్యత కలదాన్నీ మా ప దానమివ్వు. నిశ్చయంగా నీవు సర్వప్రపంచ ప్రభువువు.

ఓ ప్రభూ! ఎవరు నీ దినాలల్లో ఓపికతో సహనం వహిం చారో వారికి ప్రతిఫల మివ్వు. సత్యమార్గంలో ప్రక్క ప తప్పకుండా నడవటానికి వారి హృదయాలను బలపర . ఓ ప్రభూ! తరువాత నీ ఆనందోపేత స్వర్గంలో ప్రవేశలాభా

పొందటానికి వారిని సమర్ధులను చేసేటటువంటి వాటికంటే వారికి రమ్యమైన దినాలను అనుగ్రహించు. ఓ ప్రభుదేవా! నీవు మహోన్నతుడవు. నీ స్వర్గీయానుగ్రహాలను నిన్ను విశ్వసించేవారు నివాసంచే, ఆ వారి గృహాలమీదికి అవరోహింపచెయ్యి. నిజంగా నీవు దివ్యానుగ్రహాలను క్రిందికి పంపటంలో ఇతరులచేత అధిగమింపబడనివాడవు. ఓ దేవా! నీ విశ్వసనీయులైన సేవకులను విజయవంతులనుగా రూపొందించగలిగే అతిథేయులను పంపించు. నీ ఆజ్ఞాశక్తి ద్వారా నీవు సృజితవస్తువులకు రూపాన్ని కల్పిస్తావు. నీవు సత్యానికి సార్వభౌముడవు, స్రష్టవు, సర్వవివేకివి.

ఇలా ప్రవచించండి: దేవుడు రూఢిగా సమస్త వస్తువులను చేయువాడు: ఆయన ఆహారాన్ని అత్యధికంగా ప్రసాదిస్తాడు. ఆయన స్రష్ట, సమస్తప్రాణిమూలము, ఆకారకల్పనుడు, సర్వశక్తుడు, కర్త, సర్వవివేకి, సమస్త స్వర్గాలల్లోను, భూమి మీద, రెంటిమధ్య ఏది ఉన్నదో అందులోను ఆయన అత్యుత్తమ బిరుదాలను వహించినవాడు. అందరూ ఆయన ఆజ్ఞను జరుపుతారు. అందరూ - భూనివాసులు, స్వర్గనివాసులు ఆయన ప్రశస్తిని నిర్వర్తిస్తారు; అందరూ ఆయనదగ్గరకు తిరోగమిస్తారు.

స్రష్ట, సార్వభౌముడు, సర్వసమర్థుడు, అత్యుత్తముడు, మానవులందరూ ఎవరి సహాయాన్ని అభ్యర్థిస్తారో ఆయన అయిన నీ ప్రభువు పేరుతో

69. ఇలా ప్రవచించు: ఓ నా దేవా! ఓ సర్వ భూస్రష్టవైన నీవా! ఓ రాజ్యప్రభువా! నీ అస్తిత్వం నీకు తప్ప అందరికీ నిగూఢమై ఉంటుంటే నీవు నా హృదయ రహస్యాలను

బాగా ఎరుగుదువు. నీవు తప్ప ఇతరు డెవ్వడూ దీనిని చే లేక ఉంటుంటే నీవు నాది ఏది ఉన్నా దానిని చూస్తా ఏది నీతో తప్ప ఇతరు లందరితో విడివడచేసే సామర్థ్యా కలిగిస్తుందో దానిని నాకు నీ ఔదార్యంద్వారా కృపతో అను హించు. ఏది నీవుకాక మిగిలిన ప్రతి ఒక్కరినుంచి న స్వతంత్రుణ్ణి చేస్తుందో దానిని నాకు విధించు. ఈ ప్రపం లోను, తరువాతిదానిలోను నేను నా జీవితలాభాన్ని అన వించేటట్లు అనుగ్రహించు. నీ ఔదార్యద్వారాలను నా ము వంకన తెరచి నీ కోమలకృపను, దానాలను ఉదారంగా న ప్రసాదించు.

విశాలోదారతకు ప్రభువువైన ఓ దేవా! నీ దివ్యసహా ఎవరు నిన్ను ప్రేమిస్తారో వారిని ఆవరించుగాక; నీవు పొ ఉన్న బహుమతులను ఔదార్యోపేత దానాలను మాకు అను హించు. నీవు మాకు సమస్త వస్తువులకు తృప్తిని కలిగి వాడివి కమ్ము. మా పాపాలను క్షమించి మమ్మల్ని కరుణించ నీవు మా ప్రభువువు: సృష్టింపబడ్డ సమస్త ప్రాణుల ప్రభువువు. నిన్ను తప్ప ఏ ఇతరుడిని మేము వేడుకోవ నీ అనుగ్రహాలను తప్ప మేము ఇతరమైనవాటిని వేటిని అ పము. నీవు దాతృత్వ – ఔదార్య ప్రభువువు: నీ అధికారం అజేయుడవు: నీ కల్పనలలో అత్యధిక ప్రవీణుడవు. స స్వాధీనుడవు, మహోన్నతుడవు అయిన నీవు తప్ప మరి దేవుడు లేడు.

ఓ నా ప్రభూ! పవిత్రులు, ధార్మికులు అయిన వార్తాహ లకు నీ దీవెనలను ప్రసాదించు. నీవు రూఢిగా అసమానుడ: సర్వనిర్బంధనుడవు అయిన దేవుడవు.

70. ఓ ప్రభూ, నా దేవా! నీవు ప్రఖ్యాతుడవు! సత్యానికి నీవు రారాజువు; నీవు ఎవరి ఎడ ఇష్టపడతావో వారికి సార్వభౌమత్వాన్ని దయచేస్తావు; ఎవరి దగ్గరనుంచైతే దానిని ఇచ్ఛ ఇస్తావో వారి దగ్గరనుంచి బలాత్కారంగా దానిని ఆక్రమిస్తావు. ఎవరినైతే నీవు ఇష్టపడతావో వారిని ఘనులను చేస్తావు; ఎవరినైతే నీవు కోరుతావో వారిని నీచులను చేస్తావు. నీవు ఎవరినైతే ఇష్టపడతావో వారిని విజయవంతులను చేస్తావు. నీవు ఎవరినైతే కోరుతావో వారిని అవమానితులను చేస్తావు. నీవు ఎవరినైతే ఇష్టపడతావో వారికి అత్యంతసంపత్తిని ప్రసాదిస్తావు; నీవు ఎవరినైతే కోరుతావో వారికి దారిద్ర్యపతనాన్ని కల్పిస్తావు. నీవు ఎవరినైతే ఇష్టపడతావో వారిని, నీవు ఎవరినైతే కోరుతావో వారిమీద బలవంతులై వర్తించేవారినిగా చేస్తావు. నీవు సృజింపబడ్డ సర్వప్రాణుల సామ్రాజ్యాన్ని నీ అధీనంలో నిలుపుకొంటావు; నీ సార్వభౌమత్వపు ఆజ్ఞాశక్తి ద్వారా ఎవరంటే నీవు ఇష్టపడతావో వారిని ఉనికికోసం పిలుస్తావు. రూఢిగా నీవు సర్వజ్ఞుడవు, సర్వశక్తుడవు, అధికార ప్రభువువు.

71. ఓ దేవా! నీవు ప్రశంసితుడవు, ప్రఖ్యాతుడవు. నీ పవిత్రప్రత్యక్షతను పొందే దినం వేగంగా చేరుకొనేటట్లు అనుగ్రహించు. నీ ప్రేమోత్తమ సౌఖ్యాల పుష్టిమూలంగా మా హృదయాలను ఉల్లాసపరుచుము; మేము నీ ఇచ్ఛకు నీ నియమానికి లొంగిపోవటం కోసం మాకు దృఢత్వాన్ని అనుగ్రహించు. రూఢిగా నీ విజ్ఞానం నీవు సృష్టించిన సమస్త ప్రాణులను సృజించే ప్రాణులను ఆవరిస్తుంది. నీ దివ్యాడు నీవు ఉనికికోసం వేటిని పిలిచావో, వేటిని పిలుస్తావో ఆ వాటికి

అతీతను పొందవచ్చును. నీవు తప్ప అర్చించటానికి అ ంష
దగ్గవాడు ఏ ఒక్కడూ లేడు: నీ ప్రక్కన అరాధింపతగ్గ డు
ఏ ఒక్కడూ లేడు; నీ మహోత్తమసౌఖ్యం తప్ప శూన ం
మాత్రమే ప్రేమింపదగి ఉన్నది.

నిశ్చయంగా నీవు మహోత్కృష్ట పాలకుడవు; సార్వభ వ్
సత్యానివి: అపత్తులో సహాయానివి; స్వీయజీవనాధారుడవు

72. అపదలు అన్ని దిక్కులనుంచీ నామీద వసించా ంని
నీవు తప్ప ఇతరు డెవ్వడూ వాటిని చెదరగొట్టలేడని దా
పరివర్తన చేయలేడని నీవు పరిపూర్ణంగా ఘనంగా ఎరుగుదు వు.
నీ దివ్య స్వర్గంలో అతని స్థానాన్ని సమున్నతం చేయటా ంకి
నీ సర్వనిర్బంధనశక్తి రక్షణతో ఈ భౌతికజీవితంలోని అ ని
హృదయాన్ని పోటీచేయటానికి నీవు కోరినట్లయితే నీవు ఏ
జీవిమీద ఆపదలు పడేటట్లు చేయవని, ఆ జీవి ఈ ప్రప చ
గర్వాలవంకకు ఒరగటం జరగదని నీమీది నా ప్రేమస్వభా ం
వల్ల నేను ఒక వాస్తవాన్నిగురించి తెలుసుకొన్నాను. స్వ ల
ల్లోను భూమిమీద ఉన్న యాజమాన్యంకంటే అత్యధిక గా
నీ జ్ఞాపకాన్ని సర్వపరిస్థితులల్లో నేను అపేక్షిస్తానని వు
వాస్తవంగా, ఘనంగా ఎరుగుదువు.

ఓ నా దేవా, నీఎడ విధేయత విషయంలోను, నీమీ ది
ప్రేమవిషయంలోను నా హృదయాన్ని బలపరచు; నీ విరోధు లు
సమస్త సంఘసంబంధం లేకుండా పరిశుద్ధంగా ఉండటా
అనుగ్రహించు. నేను కోసం నీతప్ప శూన్యానికి వేదనపడ
నని, నీ కారుణ్యాన్ని తప్ప నేను ఏ వస్తువును ఆశించన
లేదా నీ ధర్మాన్ని తప్ప దేనినైనా సరే గ్రహించన
నిశ్చయంగా నీ కీర్తిమీద ప్రమాణంచేస్తాను. నన్ను, నాతోబా

నీవు ఎవరిని ప్రేమిస్తున్నావో వారిని నీవు ఎలా ప్రతివహించావో అలా క్షమించమని నిన్ను ప్రార్థిస్తాను. యథార్థంగా నీవు సర్వ శక్తుడవు, ఉదారుడవు.

ఓ స్వర్గ భూ ప్రభువా! నీవు సర్వమానవులు చేసే ప్రశస్తిని మించి అత్యధికంగా ఘనతవహించావు. శాంతి నీ విశ్వాసయుత సేవకులఎడ వర్తించుగాక; విఖ్యాతి సర్వప్రపంచ ప్రభువైన దేవుని చెందుగాక.

73. ఓ ప్రభూ: నా అత్యుత్తమ ప్రియుడా, ప్రశస్తి నీవై ఉండుగాక! నన్ను నీ హేతువులో సుస్థిరుడను చేయుము: నీ నియమాన్ని ఎవ్వరు ఉల్లంఘించలేదో, లేదా ఎవరు వ్యర్థ మైన స్వీయభావనలు గల దేవతలను అనుసరించలేదో వారిలో నేను ఒకడనుగా పరిగణింపబడటాన్ని అనుగ్రహించు. తరువాత నాకు నీ ప్రత్యక్షతలో సత్యపీఠాన్ని పొందే సామర్థ్యం ప్రసాదించు. భయంలేనివారు, దుఃఖపెట్టబడనివారు అయిన నీ సేవకులతో నన్ను కలిసిపోనిమ్ము. ఓ నా ప్రభూ! నన్ను నాకే బహిష్కరించవద్దు; లేదా నీ స్వీయాత్మ ప్రత్యక్షరూపమైన ఆతడిని గుర్తించటంలో నన్ను నష్టపరచవద్దు; లేదా నీ పవిత్ర ప్రత్యక్షత నుంచి వెనుదిరిగి పోయినటువంటివారిలో నన్ను లెక్కించవద్దు. ఎవరు నీ సౌందర్యం ఎడ తమదృష్టిని సుస్థిరం చేసే ప్రత్యేక - హక్కును పొందారో వారితోను, ఎవరు అట్టి స్థితిలో ఒక్క క్షణాన్నైనా స్వర్గ భూరాజ్యాల సార్వభౌమ త్వంతో గాని లేదా సమస్త సృష్టిప్రదేశంతో గాని పరివర్తన చేయటాన్ని అంగీకరించని ఆహ్లాదాన్ని పొందుతారో వారితోను, ఓ నా ప్రభూ, నన్ను పరిగణించు. నీ భూప్రజలు దుఃఖకరా లైన దోషాలు చేసిన ఈ దినాలల్లో, ఓ ప్రభూ, నామీద కరుణ

వహించు: ఓ నా దేవా! తరువాత ఏది నీ పరిగణనలో ‹
మత్వయుక్తమో దానితో నా లోపాన్ని పూరించు. రూ‹
నీవు సర్వాధికారివి, కరుణాన్వితుడవు, ఉదారుడవు, ని
క్షమాలక్షణుడవు.

ఓ నా దేవా! ఎవరి శ్రవస్సులు బధిరాలో, ఎవరి నేత్రా
అంధత్వయుతాలో, ఎవరి జిహ్వాలు సంభాషణావిరహితా
ఎవరి హృదయాలు జ్ఞానగ్రహణాపజయాలో అట్టివారి‹
వాడినిగా నన్ను పరిగణింపక అనుగ్రహించు. ఓ ప్రభ
అజ్ఞానాగ్ని, స్వార్థాపేక్షాగ్నుల నుంచి నన్ను విడిపించు:
సర్వోన్నత దయాగుణావరణాలల్లో నేను ప్రవేశపెట్టబడటా
సమ్మతించు; నీవు అపేక్షించిన వారికోసం నీవు దేనిని ని
మించావో దానిని నామీదకు పంపించు. దేనిని నీవు ఇ
ఇస్తావో దానిని నిర్వర్తించటానికి నీవు శక్తివంతుడవు; రూ‹
నీవు ఆపదలో సహాయకుడవు: స్వీయజీవనాధారుడవు.

74. ఓ నా దేవా! ఓ నా ప్రభూ! ఓ నా యజమాని!
ప్రేమను తప్ప ఏదైనా ప్రీతిని, నీ సామీప్యాన్ని తప్ప ఏదై
సౌఖ్యాన్ని, నీ రమణీయ అహ్లాదాన్ని తప్ప ఏదైనా ఉల్లాసా‹
నీతో సంసర్గానికి భిన్నమైన ఏదైనా అస్తిత్వాన్ని అపేక్షించ‹
దుకు నన్ను క్షమించితీరమని నిన్ను అర్థిస్తున్నాను.

75. దేవుడు తప్ప కష్టనివారకుడు ఎవడైనా ఉన్నాడా
ప్రవచించు: దేవుడు ప్రశంసింపబడుగాక! ఆతడు దేవు‹
అందరూ ఆతని సేవకులు; అందరూ ఆతని ఆజ్ఞక
స్థిరత్వాన్ని వహిస్తారు.

